# [illegible]

ప్రదర్శన

తనిశెట్టి సుబ్బారావు

దేశికవితా మండలి
విజయవాడ-2

దేశీ ప్రచురణ
ప్రథమ ముద్రణ
జనవరి - 1954
వెల: రూపాయిన్నర.

దేశీ ప్రెస్, విజయవాడ.



సంపాదకులు:
బొందలపాటి శకుంతలాదేవి
శివరామకృష్ణ

# సూచిక



ఈ కథలో మంచి డ్రామా ఉంది—

ఈ నవల్లో మంచి డ్రామా ఉంది—

ఈ డైరెక్టర్ సినిమాలో చక్కటి డ్రామా నిర్మించాడు—

ఈ విధంగా అనేకులు అనడం మనం వింటుంటాం. ఈ 'డ్రామా' అంటే ఏమిటి? దీని స్వరూప స్వభావమేమిటి? ఈ 'డ్రామా' ఎలా ఉత్పన్నమవుతుంది? సర్వసాధారణమైన జీవితానికీ నాటకంలో చిత్రించే జీవితానికీఉన్న వ్యత్యాసమేమిటి? రోజూ మనం అనుభవించే జీవితాన్నేనా నాటకంలో మనం అనుభవిస్తున్నది? ఈ ప్రశ్నలకు సమగ్రమైన సమాధానాన్ని అన్వేషించి అన్వయించుకుంటే తప్ప ఒక ఉత్తమ నాటక స్వరూపాన్ని మనం గ్రహించలేం.

ఈ ప్రశ్నలకు సవ్యమైన సమాధానాన్ని అన్వేషించాలంటే ఆమూలాగ్రంగా జీవితాన్ని గురించి తాత్త్వికపర్యాలోచన చెయ్యాల్సి ఉంటుంది.

కారల్ మార్క్స్ తాత్త్విక దృక్పథం ఈ రోజున ప్రపంచాన్నంతా ఆకర్షిస్తోంది.

నేటి మానవుని జీవితంలోని ప్రతి భాగాన్ని ఏదో ఒక విధంగా ఆచ్ఛాదిస్తోంది. ఒక్క సాంఘిక రాజకీయ రంగాల్లోనే కాక మానవుడి అంతరాత్మకు సంబంధించిన కళాతాత్త్విక రంగాలను కూడా ఈ దృక్పథం ఆవరించింది. వీధులూడ్చేవారి దగ్గరనుంచి విశ్వవిద్యాలయంతేలవరకూ అందరూ ఏదో విధంగా ఈ దృక్పథాన్నే వరిస్తున్నారు. యుద్ధం చేసినా, శాంతి కోరినా పాట రాసినా, నాటకం ప్రదర్శించినా, ఫిలిం నిర్మించినా, విమర్శ

వ్రాసినా, ప్రతిపై ఈ దృక్పథానికి అనుగుణంగా ఉందా లేదా అని చూస్తున్నారు. అనుగుణమైనదాన్ని ఆస్వాదించి అతీతమైనదాన్ని అవగాహన చేసుకోకపోవడం కూడా జరుగుతోంది.

'వర్గాలు వర్గాలు పోట్లాడుకున్నాయి. ఈ పోట్లాటలో సంఘం పెరిగింది. ఇదే చరిత్ర. ఈ పోట్లాటలోనే చరిత్ర రహస్యం ఉంది. మనిషినీ, అతని జీవితాన్నీ అర్థంచేసుకోడానికి ఇది ఒకటే సరైన కోణం' అంటోంది మార్క్సిజం.

కాని, అనాదినుంచీ ప్రవహించి వస్తోన్న మానవ జీవన విశాల చరిత్రను నిశితంగా విచారించి చూస్తే మనకు మరోసత్యం గోచరిస్తుంది. మానవ జీవన చరిత్రను గురించి కారల్ మార్క్స్ చేసిన విచారణలో సమిష్టి జీవన కార్యకలాపాలను చూచాడు కాని మానవుణ్ణి అతని అంతరంగవేదననూ గ్రహించలేకపోయాడు. సంఘంలో ఒక భాగంగావుండి ఆలోచించడం మూలంగా అతని తత్త్వదర్శనంలో ఈ అసమగ్రత ఏర్పడింది. సాంఘిక సంరంభంనుంచి దూరంగా వుండి అనాసక్తంగా ఆలోచించి ఉన్నట్లయితే అతనికి ప్రఫుల్లమైన పరిపూర్ణ సత్యం గోచరించి ఉండేది. బంధాలు తొలగిస్తానని బయల్దేరిన మార్క్సిజమే ఒక పెద్ద బంధగా తయారైంది.

అయితే చరిత్రలో మార్క్స్ గమనించని మరో సత్యం ఏమిటి? దాని ప్రాధాన్యం ఏమిటి? ఆ సత్యాన్ని కనుక్కున్నందువల్ల మన బ్రతుకులూ, మన కళలూ, మన సంస్కారం ఎలా ఉన్నత స్థాయికి పోతాయి? అని మీరు ప్రశ్నిస్తారు. ఆ సత్యాన్నే ఇప్పుడు వివరిస్తాను.

సంఘంలో అనేక మానవులు నివసిస్తున్నారు. అనేక మానవులే కాకుండా అనేక విధాలైన మానవులు నివసిస్తున్నారు. ఈ మానవులందరికీ చైతన్యం ఒక విధంగా ఉండదు. అంటే ఒకే ప్రమాణంలో అభివృద్ధిచెంది ఉండదు. కొందరికి తక్కువ చైతన్యం ఉంటుంది. కొందరికి మరీ ఎక్కువ చైతన్యం ఉంటుంది. సామాన్యంగా చూడండి—కొందరికి జీవితం సునాయాసంగా ఉంటుంది. కొందరు జీవితంలో ఎక్కువ బాధపడతారు. మనస్సులో ఎక్కువ నొచ్చుకుంటారు. ఆత్మలో ఎక్కువ వేదన పొందుతారు.

ప్రదీప్త చైతన్యంగల వ్యక్తులకూ ఇతర సాధారణ వ్యక్తులకూ ఎప్పుడూ సంఘర్షణ సాగుతూ ఉంటుంది. జీసస్ ఉన్నాడనుకోండి— అతను ప్రదీప్తచైతన్యంగల వ్యక్తి. అతన్ని సమకాలిక సంఘం అర్థంచేసుకో లేక పోయింది. ఇలాగే ప్రదీప్త చైతన్యంగల వ్యక్తిత్వం ఎప్పుడూ పరిసర సాధారణ సమాజంతో, పరిస్థితులతో ఘర్షణ పొందుతుంది. ఈ సంఘర్షణే మానవ చరిత్ర. ఇలాగే సంఘం పెరిగింది. అభివృద్ధి పొందింది. విశాలమై ఉన్నతమైన ఆదర్శాలను ఆరాధించింది. తనకు మించిన వారిని చూడలేక అసూయతో వారిని ఆహుతి తీసుకుంది.

ఈ ప్రధాన సంఘర్షణే మానవ చరిత్రలోని డ్రామా. దీనికి ప్రతినిధి శివశంకరం.

ఈ ప్రధాన సంఘర్షణను కేంద్రంగా చేసుకుని 'మావూరు' నాటకం పరిభ్రమిస్తుంది. చరిత్రలో అనాదిగా సాగివస్తున్న అనన్త చైతన్యవేదనే ఇతివృత్తంగా ఈ నాటకం ప్రయాణం చేస్తుంది.

చైతన్యమే ఈ నాటకానికి 'హీరో' అది పొందే వేదనే ఇతివృత్తం.

ఈ చైతన్యం శివశంకరం. అతను నిర్మలంగా నిర్విచారంగా జీవితం గడుపుతున్న బడిపంతులు. అతని మనస్సూ ఆత్మా నిండైన కుండల్లాంటివి. ఏ కలవరమూ లేని కలలాంటి బ్రతుకు గడుపుతున్నాడు. అతని కన్నుల్లో శాంతీ కాంతీ కాపురం ఉంటాయి. అతని ఆత్మలో అంటరాని అగ్ని ఉంటుంది. అతను దీపంలాంటివాడు.

కాని చుట్టూ చీకటి తుఫాను వీచింది. నెమ్మదినెమ్మదిగా దీపం కొట్టుకోడం మొదలెట్టింది. కొంతకాలం కొట్టుకోడం బాగున్నట్టుగా అనిపించింది రాను రాను తుఫాను మోసం తెలిసింది. కాని అప్పటికే సమయం మించిపోయింది. దీపం ఆరిపోయింది.

ఈ దీపంలాంటివాడు శివశంకరం. అతను తప్పు చేస్తున్నాడని అతనికి తెలుసు. తప్పు చెయ్యడం తప్పనికూడా అతనికి తెలుసు, తప్పునుంచి తప్పుకోడం కోసం పోరాడుతూనే తప్పుకు లొంగిపోతాడు. అందుచేతనే

అతన్ని అతను టార్చర్ చేసుకుంటాడు. 'ఈ సెల్ఫ్ టార్చర్' అనేది గొప్ప చైతన్యంగల వ్యక్తులకు కానీ ఉండదు. ఈ నిశితసంఘర్షణ శివశంకరం పాత్ర ద్వారా అతి సూక్ష్మంగా చిత్రించడంవల్లనే ఈ నాటకానికి అద్వితీయమైన ఉదాత్తత వచ్చింది.

సాధారణంగా నాటకాలు రాసేవాళ్లు కొన్ని పాత్రలను సృష్టించడం వాటి వర్ణనను నాటక రంగంమీద చూపడం మనం చూస్తుంటాం. మంచివాడు హీరోగా ఉంటాడు. చెడుమనిషి విలన్‌గా ఉంటాడు. ఇద్దరూ పోట్లాడుకుంటారు హీరో గెలుస్తాడు. విలన్ ఓడిపోతాడు. సామాన్యంగా నాటక రచయితలందరూ ఈ టెక్నిక్ అవలంబిస్తారు. ఈ టెక్నిక్ అవలంబించి వ్రాసినవే చాలావరకు నాటకాలు. వాటిల్లో పాత్రలనూ వాటి చేష్టలనూ రూపాలనూ మనం చూడొచ్చు.

కాని 'మా వూరు' నాటకంలో మరో విశిష్టమైన అనన్యమైన టెక్నిక్ ఉంది. ఈ టెక్నిక్ ప్రపంచ నాటక సాహిత్యంలో ఒక్క హామ్లెట్‌లో మాత్రమే చూడగలుగుతాం. కింగ్ లియర్‌ను మనం మూర్తి కట్టుకోగలం. ఒథెల్లోనుకూడా అలాగే. రాముణ్ణీ దుష్యంతుణ్ణీ అలాగే. కానీ హామ్లెట్‌నూ శివశంకరాన్నీ మనం మూర్తి కట్టుకోలేం. హామ్లెట్, శివశంకరం__వీరు మనుష్యులు కాదు. మనస్సు ఒక పరిస్థితిలో పొందే ఒక 'ఫేసెస్' పాత్రగా చిత్రించడం అతి విచిత్రమైన విషయమే కాక గొప్ప సిద్ధహస్తుడు కాని చెయ్యలేని విషయం. ఈ నాటక రచనలో ఈ ప్రత్యేకత ఉంది. శివశంకరం మనస్సు పొందే 'ఫేసెస్' పాత్రమే దీనికి అంకాలు. అనే ముఖ్యం. ఈ సూక్ష్మమైన టెక్నిక్‌తో వ్రాసిన మొదటి తెలుగు నాటకం ఇదేననుకుంటాను.

ఈ నాటకం ఒక విధంగా ఆంధ్ర నాటక రచనా చరిత్రలో ఒక నూతనాధ్యాయాన్ని ప్రారంభిస్తుంది. ఐరోపా సాహిత్యంలో టాల్‌స్టాయ్ మహోనీయులు వ్రాసిన అన్నాకెరినీనా నవల ఇలాగే నూతన శకాన్ని ప్రారంభించింది. అంతకు పూర్వం నవలల్లో మనుష్యులు చేసే పనులే వ్రాసే

వారు కాని ఎందుకు చేసేవారో వ్రాసేవారు కాదు. టాల్‌స్టాయ్ ఎందుకు చేసేవారో వ్రాశాడు. దాంతో నవలా రచనలో ఒక అద్భుత పరివర్తన వచ్చింది. ఇలాగే 'మావూరు' నాటకం ఆంధ్రనాటక రచనకు ఒక అపూర్వ పథానికి మార్గగామి అవుతుంది.

సుప్రసిద్ధ రష్యన్ నటుడూ, నాటకరంగ పితామహుడూ స్టానిస్లవిస్కీ ట్రాజడీని నిర్వచిస్తూ ఇలా అన్నాడు. 'ఒక గొప్ప వ్యక్తి అంతరంగిక వేదనే ట్రాజడీ' అని. ఇది ఎంతో నిశిత దృష్టితో చెప్పిన నిర్వచనంగా కనుపిస్తుంది. ఈ దృష్టితో చూస్తే 'మా వూరు' నాటకం గొప్ప ట్రాజడీ. శివశంకరంలాంటి నిర్మల స్వభావం కలవాడు మలిన వాతావరణానికి ఆహుతి అయ్యే ప్రాసెస్‌లో అతని ఆత్మ పొందిన అగ్నివేదన ఇందులోని ట్రాజడీ. ఎలాంటివాడు ఎలా అయ్యాడా అనిపిస్తుంది. ఒక బీదవాణ్ణి చూసినప్పుడు మనకు జాలి కలుగదు. అగర్భ శ్రీమంతుడు పేదవాడై బాధపడుతుంటే కడుపు తరుక్కుపోతుంది సీతాదేవిలాంటి మహాపతివ్రత ఏ పొరబాటువల్లనైనా పతితురాలైతే మనలో ఒక విచిత్రమైనవిషాదం ఉద్భవిస్తుంది. ఇదే ఫండమెంటల్ ట్రాజడీ. ఒక సన్యాసి భ్రష్టుడవుతాడనుకోండి. అయ్యో అనిపిస్తుంది. ఈ ఫండమేన్‌టల్ ట్రాజడీమీద కన్‌టెంప్లేట్ చెయ్యడం వల్లనే 'మా వూరు' నాటకం హామ్లెట్‌లాగా అభిజ్ఞాన శాకుంతలంలాగా చిరస్మరణీయమూ సార్వకాలికమూ సర్వజనీనమూ అభినవ మనోజ్ఞమూ అజరామరమూ అయిన నాటకం అయింది.

'నాన్నా! ఇదివరకు ఎప్పుడూ చదువుకుంటుండేవాడివి. ఇప్పుడు మానేశాం?' అంటుంది సుందరి

'అవునమ్మా, ఆ చదువూ సంధ్యా అప్పుడే పోయింది' అంటాడు శివశంకరం.

నిజమే అతనన్నది. నేనూ నీవూ అతనూ అందరం ఇప్పుడు శివశంకరంలాగే ఉన్నాం. సత్యానికీ శివతకూ సౌందర్యానికీ దూరమైపోయాం. కళానికీ కల్మషానికీ ఆహుతైపోయాం. మనల్ని మనమే ద్వేషించుకుంటున్నాం.

మనల్నందర్నీ ఏదో చీకటి తెర కమ్మింది. సుఖంలేదు, దుఃఖంలేదు, శాంతి లేదు—అశాంతి లేదు. మనల్ని ఏదో పిశాచం లాక్కుపోతోంది. మన శత్రువు మనలోనే తిష్ఠవేశాడు. అర్థంలేని జీవితాన్ని వ్యర్థంగా గడుపుతున్నాం. ఆకాశంక్రింద అత్యల్పంగా జీవిస్తున్నాం.

ఎప్పుడు మనకు ముక్తి?

ఏమైంది మనలో శక్తి?

ఎక్కడుంది ప్రశాంతి?

జనన మరణాలమధ్య నిశ్చలంగా నిల్చుని అద్భుతానందం పొందిన శివశంకరంలా మనలో జ్ఞానోదయం ఎప్పుడవుతుంది?

'మావూరు' ఇదే ప్రబోధిస్తోంది. మనలోవున్న వైరుధ్యాన్నే వెలికి తీసి మనకు చూపుతోంది

బాధలోనే ఒక శాంతినిస్తోంది!

చీకట్లోనే ఒక వెలుగు చూపుతోంది!

ఇంతకన్న మరేం కావాలి?

బెల్లంకొండ రామదాసు

# ఇందులోని పాత్రలు

---

| | | |
|---|---|---|
| శివశంకరం | : | పల్లెటూరి బడిపంతులు. |
| సింహాచలం | : | గ్రామ పెత్తనదారు, ఒకపార్టీ నాయకుడు. |
| బ్రహ్మయ్య | : | గ్రామ కరణం, రెండవ పార్టీ నాయకుడు. |
| మహంకాళి | : | కోర్టు పక్షి. |
| సత్యం | : | శంకరం మేనల్లుడు. |
| యేసోబు | : | ... |
| వెంకటేశు | : | ... |
| అమీనా | : | ... |
| జవాను | : | ... |
| కామేశ్వరి | : | శంకరం భార్య. |
| సుందరి | : | శంకరం కూతురు. |



ప్రప్రథమంగా ఆంధ్ర ఆర్ట్సు థియేటరు తరపున

.... .... ప్రదర్శించినపుడు .... ....

| | | |
|---|---|---|
| శంకరం | ... | నాగభూషణం |
| మహంకాళి | ... | లక్ష్మీనరసయ్య |
| సింహాచలం | ... | నాజర్ |
| బ్రహ్మయ్య | ... | హరినారాయణ |
| యేసోబు | ... | రామకోటి |
| సత్యం | ... | మధుసూదనరావు |
| వెంకటేశు | ... | సత్యం |
| అమీనా | ... | డా॥ వీరయ్య |
| జనాను | ... | అప్పలస్వామి |
| కామేశ్వరి | ... | కొప్పరపు సరోజిని |
| సుందరి | ... | వీరమాచనేని సరోజిని |

# మహా పూరు

## మొదటి రంగం

---

[ బడిపంతులు శివశంకరంగారి ఇల్లు. బల్ల, బల్లమీద అద్దం దువ్వెన, గోడకు పటాలు, ఒకమూల రెండు కుర్రలు, మరికొన్ని పాత్రసామానులూ, ఒక కుర్చీ, ఒక బెంచీ వుంటాయి. ఒకప్రక్కన మంచం ఎత్తి వుంటుంది. కూతురు సుందరి బల్లమీద అద్దంముందు కూచుని తలదువ్వుకుంటూ పాడుతూవుంటుంది. భార్య కామేశ్వరి వంట గదిలో వుంటుంది. బైటనుంచి ఎవరో పెద్దకేకలువేసూ పిలుస్తారు ]

అమీనా : ఏమండీ! ఎవరు లోపల ?

(ఆమె పాడుతూనేవుంది) 'ఓహో, జీవనదేవి రావో !'

అమీనా : ఏమండోయ్ ! శివశంకరం గారిల్లు ఇదేనా ?

[ఆమె పాడుతూనే గుర్తిస్తుంది]

అమీనా : (ఇద్దరు జవానులతో హఠాత్తుగా లోపల ప్రవేసించి) బడిపంతులు శివశంకరం ఇల్లు ఇదేనా ?

సుం : (సుందరి భయపడి) అమ్మా! ఎవరో వచ్చారే ! (అంటూ జడ అలాగేపట్టుకుని లోపలకు పరుగెత్తుతుంది. అమీనా, జవానులు ఇంటిని పైకి కిందికి చూస్తూ పరిశీలిస్తుంటారు)

1వ జవాను : ఏమండి! శివశంకరంగా రింట్లో లేరూ?

[ లోపలినుండి కామేశ్వర "లేరండీ" అని జవాబు ]

1వ జ : రండి, రండి, బైటికి రండి అమీనాగా రొచ్చారు.

కామేశ్వరి : (ఆశ్చర్యంతో బైటికి రాగానే)

అమీ : శివశంకరంగారు మీ భర్తా?

కామే : (మాట్లాడదు)

అమీ: ఇది మీ స్వంత ఇల్లేనా?

1వ జ: డోరు నెంబరు అదే సార్!

1వ జ: మీ ఇల్లు జప్తు చేస్తున్నాం.

కామే: మా ఇల్లా! జప్తా! ఆయనలేరు. కొంచెమాగొచ్చి మాట్లాడండి!

1వ జ: ఆయన లేకపోతే యేం? ఇల్లుందిగా...

2వ జ: వారంటొచ్చి వారమైంది...

అమీ: పిలిపించండి.

కామే: కొంచె మాగండి...కూర్చోండి...ఆయన బళ్లోకెళ్లారు... సుందరీ!

సుం : (వస్తుంది. తల్లిమాటకోసం ఎదురు చూస్తుంది)

కామే: త్వరగా వెళ్ళి నాన్నగారిని పిలుచుకురా... పో...

సుం : ఎందు కొచ్చారమ్మా?

కామే: ముందు వెళ్ళిరా పో...ఇక్కడున్నట్లు రావాలి!

సుం : (బయలుదేరుతూనే) సత్యం బావొస్తున్నాడు... (బయటికి వెళ్ళిపోతుంది)

1వ జ: (అమీనాతో) టైమ్ లేదండీ, మొదలు పెడదామా?

1వ జ: (కామేశ్వరితో) మీారు బయటికి వెళ్ళండి... సామా నులు లెక్కపెడతాం సాబ్ !...

అమీ: నువ్వు పాత్ర సామానులు లెక్కపెట్టు, నువ్వు కుర్చీలు, మంచాలు, పతాలు అన్నీ... మీారు బయటికి వెళ్ళండమ్మా !

కామే: ఉండండి ! ఆగండి ! (గాద్గదికంగా)

[ సత్యం సుందరి చెయ్యి పట్టుకుని లాక్కొస్తాడు సంతోషంగా ]

సత్యం: ఏంటత్తా, సుందరిని ఎర్రటెండలో పంపుతున్నావు ?

కామే: (కోపంతో) దాన్ని విడిచిపెట్టు ! (సుందరి వదుల్చుకుంటుంది) వెళ్ళలేదేం ?

సుం : (సత్యాన్ని చూస్తుంది)

సత్యం: మీారెవరు ? ఎందుకొచ్చారు ?

1వ జ: ఈ యిల్లు జప్తు చెయ్యటానికొచ్చాం... వారు అమీనాగారు... మీారెవరు ?

సత్యం: మీారెవరు ? జవానుగారా ?

అమీ: మీాపని మీాకు కానివ్వండి... ఇంకా రెండు జప్తులున్నై.....నువ్వీ యింట్లో వుండేవాడివా ?.....నీ సామానులేమైనా ఉన్నయ్యా ?

కామే: ఇతను సత్యమని–ఆయన మేనల్లుడు...

సత్యం: శెట్టి జప్తు పెట్టాడా ?...దుర్మార్గుడు (కామేశ్వరితో) సింహాచలం ఇంట్లో కనిపించాడు !

కామే: నువ్వెళ్ళిరా సత్యం ! మీా మామ బడిదగ్గరున్నాడేమో ! (అమీనాతో) నాన్నను ఆగమనండి ! ఆయన వచ్చి సమాధానం చెప్తారు...

అమీరా: సమాధానం వినడంకాదు మా పని...

సత్యం: సంసారాలాన్నదమా ?

అమీరా: ఏయ్ ! నువ్వు బయటికి నడువ్ !

సత్యం: ఇంటి యజమాని అనుమతి లేకుండా మీకు ఇంట్లో ప్రవేశించే హక్కుందా ?

అమీరా: హక్కా! హక్కులడిగేదాకా వచ్చిందీ! అరే ప్యూన్

సత్యం: ముందు మీరు బయటికి నడవండి !

కామే: ఆయన ఇంట్లో లేరని చెప్తుంటే ఏమిటీ అల్లరి ?

అమీరా: (సత్యంతో) నువ్వు తొలుగు ముందు! లేకపోతే హిండరింగ్ ది ఎక్సిక్యూషన్ ఆఫ్ ది రైట్‌ఫుల్ డ్యూటీస్ ఆఫ్ ది గవర్నమెంటు సర్వెంటు.

సత్యం: ఆప్ ! ఆప్ ! ఆప్ ! అదంతా కట్టిపెట్టి ముందు బయటికి నడవ్వయ్యా (అమీనాకు ఎదురు నిలబడతాడు.)

అమీరా: నిన్నేంచేస్తానో తెలుసా ? ఏయ్ ప్యూన్ !

[ ఇద్దరు జవాన్లు వస్తారు. వాళ్లిద్దరి చేతుల్లోనూ ఏవో పాతసామాను ఉంటాయి.]

సత్యం: అవి తోముతున్నారా ? బైటికి వెళ్ళండి !. మీరు కూడా ఊఁ...

1వ జ: ఏమిటి సార్ ! ఏమన్నా కుదిరిందా (డబ్బు అని వేళ్ళతో సైగ చేస్తాడు)

అమీరా: లేదు.

1వ జ: వీణ్ణి బయటికి గెంటేస్తాం సార్

సత్యం: అత్తయ్యా, కర్ర ఇటివ్వు ! (అక్కడవున్న కర్ర తనే తీసుకుంటాడు) రండి ! మీరు మాటలతో బుద్ధి రాదు... అత్తయ్యా లోపలికి పో-ఇకరండి చెబుతాను..

నేను బతికుండగా మా మామ ఇంట్లో అడుగు పెట్ట నివ్వను!

1 వ జ: చూస్తారేం సార్ ?

2 వ జ: వెయ్యండి సార్ దెబ్బ!

అమీ: వద్దు! ఒరేయ్_వెళ్ళి సింహాచలంతో మాట్లాడదాం రా...సాయంత్రానికి యిల్లు గుల్ల చెయ్యకపోతే నా పేరు...(వెళ్ళిపోతారు)

సత్యం: నీకు పేరొక ఏడ్చింది! అత్తయ్యా నేను వెళ్ళి మామను పిలుచుకొస్తాను...నువ్వేం భయపడవద్దు!

కామే: వాళ్ళసలే మొరటు మనుష్యులు...వాళ్ళని రెచ్చ గొట్టావేం రా!

సత్యం: అవును నేనేం చేసినా రెచ్చగొట్టినట్టే కన్పిస్తుంది... కాని మామయ్యను సింహాచలం యింటికి వెళ్ళమనేవు వీళ్ళ పార్టీలో చేరితే ఇల్లు మిగిలినా వాళ్ళు మిగలదు! ఇప్పుడే పిలుచుకొస్తాను.

సుం : (వస్తుంది) అమ్మా! ఇప్పుడెట్లా? అంత ధైర్యంగా వెళ్ళగొడితే బావమీద పోట్లాడతావేమే?...

కామే: ఇట్రా...వాణ్ణి మాటంటే ముందు నువ్వూరుకోవు... త్వరగావెళ్ళి...సింహాచలంగారింటికి...ఆయన భార్యను పక్కకు పిలిచి...నేను చెప్పానని చెప్పు...యీ సంగతి...

సుం : వాళ్ళమ్మాయి పెళ్ళిగదూ?...భోజనానికి పిలిచారు వెళ్దామంటివే...నువ్వే వెళ్ళి మాట్లాడరాదూ?

కామే: ఏదీ మీ నాన్నగారు వస్తేనా? ఇప్పటికి మూడు సార్లు వచ్చిపోయారు...ముంకు నువ్వెళ్ళు...చూడు... ఆమెను అత్తయ్యా అని పిలువ్...వాళ్ళబ్బాయి చాలా మంచివాడే...యింటర్ చదువుతున్నాడు.... పలుకరిస్తే మూతి బిగించుకు నేవ్... ఈ సంగతిచెప్పా

[ సుందరి వెళుతూంటే కామేశ్వరి మళ్ళీ పిలుస్తుంది ]

కామే: సుందరీ! ఇట్రామ్మా!

సుం : (తిరిగివచ్చి) ఆమెతో చెబుతాగాని...వాళ్ళబ్బా యితో పలుకను...మొన్న గుళ్లో కెడితే...

కామే: చెతురాడాడనా...ఇప్పుడేం ముంచుకుపోలా...మా ట్లాడూ...ఆమెను అత్తయ్యా అని పిలువ్...గొలుసు పైకి వేసుకోవే...ఊళ్లో పేరంటాళ్ళంతా అక్కడే వుంటారు...(సుందరి వెళ్ళిపోతుంది)

[ మహంకాళి వస్తాడు, దగ్గరగాడుగు, దస్తావేజులు, కళ్ళద్దాలు ]

మహా: (ఊగుతూ వస్తాడు, సంతోషం) అయ్యామ్మాయ్ కామేశ్వ రమ్మా! ఎన్నాళ్ళ కెన్నాళ్ళకు...

కామే: రా మామా! రా! నీకోసం ఎదురుచూస్తున్నా.

మహా : ఏడీ? మన శంకరం ఏడీ? చిన్నపిల్ల...

కామే: ఆయన బడినించి రాలా...అమ్మా యిప్పుడే సింహా చలంగారింటి కెళ్ళింది.

మహా: ఏమిటీ! ఆ పిల్లేనా...చూడగానే పోల్చుకున్నాలే... ఏదీ? ఇంతప్పుడు చూసిన జ్ఞాపకం! అంతా మే మేనా?

కామే: ఏకో ఇలాగున్నాం! ఆపదలో ఆదుకోవడానికి దేముడిలా వచ్చావు మామా!

మహా: ఎంతమాట! ఎంతమాట! నీ కోసమైనా రాకతప్పుతుందా అయ్యామ్మాయ్. ఏమో నాకు కాలం గడిచిపోతున్నది...చేయదగినవాళ్ళకు చేయదగిన వుపకారం చేస్తే పుణ్యమన్నా వుంటుంది...ఆ ఆమాడూ...ఈ దస్త్రరం కొంచెం జాగ్రత్తగా దాచిపెట్టూ ఇనప్పెట్టెలో.

కామే: ఇనపెట్టెక్కడిది మామా! అలమరలో...

మహా: వద్దు, వద్దు. అలమరలో వద్దు...నీ దాపుడుచీరలు పెట్టుకునే పెట్టెలో భద్రంగా కలరావుండలు వేసి...

కామే: (నవ్వుతూ) ఇటివ్వు...నీ కెందుకు, మళ్ళీ నీ సొమ్ము నీ కప్పజెప్పకపోతే అప్పుడందువుగానీ. ఏమున్నాయి యిందులో? డబ్బేమన్నా ?

మహా: అడిగావ్ ? అంతకంటే ముఖ్యమైనవి, దస్తావేజులు... న్నా ఆయుష్షంతా యిందులో వుంది...సరేగాని, యింటికి మొన్న సంక్రాంతికి సున్నం కొట్టించలా? అహఁ దానదేముందిలే ?...

కామే: (దిగులుగా) నువ్వొన్నాళ్ళనుంచీ మా అతీ గతీ పట్టించుకోలేదుగద...యిప్పుడే...యిప్పుడే వచ్చావు. మా పెళ్ళినాడీయన చేసిన బాకీ మాకొంపదీస్తున్నది. జప్తు కొచ్చావు...యిప్పుడే...

మహా: నిజమేనా? ఊళ్లో గోలగా వుందిలే...ఈ సమయంలో అపశకునంలాగా నేను రావడమెందుకా అనుకుంటూనే వున్నా ఏడీ? యింకా శంకరం బడినించి రాలా ?

కామే : ఆయనకీ సంసారం ఉన్నా పోయినా ఒకటే...బడిలో వచ్చే జీతం పాయిలో పుల్లలకైనా సరిపోదు...యిహ యివాళనుంచీ మాకు నిలవనీడ వుండదు.

మహా : నువ్వట్లా వుండమ్మాయ్...దీనికేదో తతంగం చేద్దాం. నేనున్నానుగా...

కామే : నువ్వే పూనుకోవాలి మామా...మాస్థితి బాగుపడే వరకూ నిన్ని కర్ణుంచి కదలనివ్వను.

మహా : ఆ నువ్వంటేమాత్రం కదుల్తానా ?

కామే : మొన్న సింహాచలంగారు తన పార్టీలో చేరమనీ, స్కూలు మేనేజరు ఉద్యోగం ఖాళీఅయితే అదిగూడ యిస్తామనీ కబురంపితే ఈయన పెడముఖం పెట్టాడు.

మహా : అయ్యయ్యో! భలేఛాన్సు పోగొట్టుకున్నాడే...సింహాచలం నాకు బాగా పరిచయంఅమ్మాయ్...అతనూ నేనూ జిల్లాకోర్టులో కలుసుకుంటూండేవాళ్ళం...

కామే : అయితే నువ్వు గట్టిగా పట్టుబట్టి ఏదో ఒకటి తేల్చు మామా...ఊరినిండా అప్పులు, యింట్లో పెళ్ళికెదిగిన పిల్ల...జప్తు పెట్టించిన శెట్టి యిప్పుడు సింహాచలం యింట్లోనే వున్నాడు.

మహా : వాడు శెట్టీ! మహా మొండిఘటం... డబ్బుకూ వాడికీ లంకె... అయినా గుండెలతో సింహాచలంమాట కాదంటాడూ.........అసలు మనవాడిట్లా మునగదీసుకుని కూర్చోడమేమిటి! మిమ్మల్ని జొన్నన్నం తినిపించి....

కామే : (ఆశ్చర్యంతో) నీ కెవరు చెప్పారు మామా !

మహా : అయితే ఈవూళ్లో ఈమధ్య జరిగిన కొట్లాట ఏమైందో!

కామే : నలుగురు మాలాళ్ళకి దెబ్బలు తగిలినయ్.

మహ : మాలాళ్ళసంగతి కాదు...సింహాచలం పార్టీ, కరణం బ్రహ్మయ్య పార్టీయేనా కొట్టుకున్నదీ? కేసు నడుస్తూంది కదూ?

కామే : నాకు తెలియదు.

మహ : ఆ, నడుస్తూందిలే...బలే ఛాన్సు.

కామే : మొన్న సింహాచలంగారు ఒక పిటీషను రాసిపెట్టమని బడిదగ్గిరికి స్వయంగా వచ్చి అడిగితే, నాకు తీరిక లేదన్నారు.

మహ : మనవాడు! అట్లా వుండాలి... బాగుపడేరాత వుండొద్దమ్మాయ్. ఆయన పెద్ద మోతుబరీ! 20 అరకలుపెట్టి సేద్యం చేయిస్తున్నాడు. పంచాయితీ బోర్డు ప్రెసిడెంటూ, పైగా పాతికేళ్ళనించీ ఏకఛత్రాధిపత్యంగా పార్టీని నిలబెట్టుకొస్తున్నాడు......అతని అండవుంటే మనవాడెంత పైకొచ్చేవాడు.

కామే : చదువుకున్నారనే గాని...

మహ : నాకు తెలియదూ, వాళ్ళి అమాయిక చక్రవర్తి.... అంత మంచివాడూ, అంత మెతక మనిషీ....(నశ్యం వేసుకుంటాడు) అయినా ఇంత చదువుకున్నవాడు బడి పంతులేమిటి? ప్లీడరు కాగూడదా? కాంగ్రెసు లీడరు కాగూడదా? ఏదో ఆదా వొచ్చే వుపాయం చూడకుండా......

కామే : ఆ వుపాయమేదో నువ్వే చూడాలి. జప్తుకొచ్చినవాళ్లు ఎంత అసహ్యంగా......

మహా : కాదుమరి! బలేవాడు మనవాడు. సరేగాని......
(కళ్ళద్దాలు సర్దుకుని) ప్రస్తుతం మన దగ్గరేమైనా డబ్బుందా?

కామే : ఇంట్లో ఎర్రని ఏగానిగూడా......

మహా : అహాఁ అడుగుతున్నా. ఫర్వాలేదులే. ఇప్పుడు నా స్థితిగూడా ఏణ్ణర్ధంనించీ ఎత్తుబడింది.

కామే : ఏం? మీ కేసులన్నీ ఏమయినై?

మహా : అడిగావ్? గుంటూరులో అయిపోయింది. ఇహ మద్రాసు పోవాలి. రెండెకరాలు పల్లం మిగిలితే దాన్నిగూడ తాకట్టుపెట్టి...

కామే : (బయటికి చూస్తూ) ఆయనింతవరకూ రాలేదు. సింహాచలంగారింట్లో ఇంటిల్లపాదికీ భోజనం చెప్పిపోయారు.

మహా : మరింకేం, అక్కడికే వెళ్ళాడేమో!

కామే : ఆయన కిష్టంలేకే బళ్లో కూచునివుంటారు. ఆ మాల సజ్జునంతా చుట్టూ కూచోబెట్టుకుని, ఎంతసేపూ వాళ్ళకు చదువు చెప్పనూ, వాళ్ళ ఇళ్ళకువెళ్ళి ఆ మాలకూడు తిననూ......

మహా : వాడు సత్యం ఇక్కడున్నాడా? కాలాంతకుడు... ఎందుకున్నట్టు?

కామే : అక్కణ్ణుంచి వచ్చి ఇక్కడ తిష్ఠవేసి, అమ్మాయినిచ్చి పెళ్లిచెయ్యమని ఒకటే పోరు. నీకూ మాకూ అందదూ నాయనా, ఆ ఆశ పెట్టుకోవద్దని చెప్పేశా...

మహా : మరింకెందుకున్నాడీ వూళ్లో?

కామే : ఇంకెందుకు—సాధించాలని .. రెణ్ణెల్లనించీ కరణం బ్రహ్మయ్య ఇంట్లో పడుకుంటున్నాడు.

మహా : (బయటికి చూస్తూ) అదుగో! మనవాడేనా? శంకరం గదూ!

కామే : ఆ, వస్తున్నారు! నువ్వు చెప్పాలి. నీమీద కొండంత ఆశ పెట్టుకునున్నా... ఇంటిని నిలబెట్టి పుణ్యం కట్టుకో మామా! ఆయనకు నచ్చజెప్పు. ఇప్పుడు సింహాచలం గారి కాళ్ళమీద పడితేగాని, ఆ సెట్టి......

మహా : సెట్టిదొకటేనా! తర్వాతమాత్రం—చూడమ్మాయ్, వాణ్ణి సింహాచలం పార్టీలో చేర్చి, నాయకుణ్ణి చేసి, చక్రం గిర్రున తిప్పకపోతే...

కామే : ఆయన ఒప్పుకుంటారా?

మహా : ఎవడికోసం ఒప్పుకుంటాడు అడిగాక! అదంతా నాకు వొదిలేసెయ్! ముందు నువ్వెళ్ళి సింహాచలం భార్యతో మాట్లాడుతూండు. ఏం? ఈ బాకీలన్నీ తీర్చి, పదెకరాల పల్లం కొనిపడేస్తే, పిల్లకు లక్షణంగా ఏదో పెద్ద సంబంధం చూసి......

కామే : సింహాచలం కొడుకు ముచ్చటగా...

మహా : (ఆమె ఆలోచనకు అందిస్తూ) ఓహో! ఇంకేం? ... ఫస్టు! అమ్మాయ్! నా వెనక నువ్వుండు. వాడి వెనక నేను కథ రంజుగా నడిపిస్తా. మహాంకాళంటే పదూళ్ళకి హడల్. వెళ్ళు, వెళ్ళు, నువ్వెళ్ళు. చూడు, సింహాచలాన్ని పంపమని చెప్పు భార్యతో. పంపించాలి మరి.

ఇదిగో, బీదఅరుపులు మొదలుపెట్టేవ్...... బింకంగా మాట్లాడుతూనే...

కామే : ఇల్లు దక్కించు. ఆయన మతిమార్చు. ఆయనకు నా మాటంటే నే గిట్టదు.

మహా : నువ్వా పదమ్మాయ్! మహంకాళి తల్చుకుంటే మతీ, గితీ, స్థితీ అన్నీ మారతంయ్!

[ కామేశ్వరి వెళ్ళిపోతుంది. మహంకాళి వళ్యం పీల్చుకుంటాడు. శంకరం వస్తాడు. అతనితో మాట్లాట్టానికి సిద్ధపడతాడు. ]

మహా : ఎన్నాళ్ళ కెన్నాళ్ళకు చూశానబ్బాయ్! రా, రోడ్డు మీద ఎండలు. నిలబడి మాట్లాడుతున్నా వేం? ఇంటికి రమ్మనకపొయ్యావా ?

శంకరం : ఆ భోజనాల కెళ్లాలట. భోజనాలూ, పెళ్ళిళ్ళూ... రానని చెప్పి పంపుదూ...

మహా : వెళ్ళరాదూ? ఇప్పుడే ఆమ్మాయి వెళ్ళింది.

శంక : చాలాకాలాని కొచ్చారే!

మహా : నేనా? ఆ దేహం ఇప్పుడొచ్చిందిగాని, మా కామేశ్వ రమ్మా, నువ్వూ, సుందరమ్మా ఎప్పుడూ—మీా ఇంట్లోనే నా జీవుడు.

శంక : (నవ్వుతూ) ఎప్పుడూ కన్పించలేదే!

మహా : ఆధ్యాత్మికంగా చూస్తేగదోయ్ కన్పించేదీ! అదంతా ఈ కాలపువాళ్ళకు అంతుపట్టదులే. ఏమిటో నీకీ కష్టాలేమిటో....ఈ వుద్యోగం, ఈ కష్టాలూ, ఈ జబ్బులూ. నువ్వొట్టి మేదకుడివని, నిన్ను కనిపెట్టివుండ మని మీా తండ్రి నాతో అంటూండేవాడు.

శంక : మా తండ్రివిషయం జ్ఞాపకం చెయ్యక్కర్లేదు. నువ్వొచ్చావని వినగానే అనుకున్నా ఏదో తెచ్చిపెడతావని.

మహా : నే నొచ్చినట్లు నీ కిప్పుడే ఎవరు చెప్పారు, ఇదేం చిత్రమో! ఎక్కడికెళ్ళినా నా సంగతి ఎలట్రీలా పాకిపోతుంది.

[శంకరం కుర్చీలో తలపట్టుకుని కూర్చుంటాడు. మహంకాళి దగ్గరగా వస్తాడు. ఎలా మాట్లాడాలా? అని యోచనచేసి అతని రెండు చేతులూ పట్టుకుని నిలబెట్టి............]

మహా : ఏమిటో, ఈ కష్టాలేమిటో, ఈ వుద్యోగం, ఈ అప్పులూ, ఈ అప్రతిష్ఠ...

శంక : ఇప్పుడే ముప్పొంది? జప్తు కొచ్చారనేగా!

మహా : ఇన్నాళ్ళూ జాగుచేస్తే ఇప్పుడు నెత్తిమీదికొచ్చింది. ముందు జాగ్రత్తపడి నాలుగు రాళ్ళు పోగుచేసుకుంటే!

శంక : ఇప్పుడనుకుని ప్రయోజనం ఏముంది. వచ్చేదేదో రానే వచ్చింది. అనుభవించాల్సిందే. నాకొక్కటే సంతృప్తి. ఆస్థిపోయినా అభిమానం నిలుస్తుంది.

మహా : ఇదెక్కడి వెర్రితనమోయ్? ఇప్పుడొచ్చి మీ యింటిమీదికి విరుచుకుపడితే.

శంక : అవును, ఏం చెయ్యగలం!

మహా : పద! సింహాచలంతో మాట్లాడదాం. నే నేర్పాటు చేస్తా. వీళ్ళ కవసరమబ్బాయ్.....నువ్వొప్పుకుంటే కూచోపెట్టి పూజిస్తారు. వాళ్ళ పార్టీలో చేరి...

శంక : (నిశ్చయంగా) ఇక్కడ పార్టీల గొడవలు నీకు తెలియవు. ఎంత మంచివాడైనా ఈ వూళ్ళో ఏ పార్టీలో

చేరినా భ్రష్టుడైపోతాడు. ఎప్పుడూ తగాదాలూ, పిటీషనులు. కుట్రలూ, ఖూనీలు, కోర్టులచుట్టూ తిరగటం ఒకటికాదు, తలచుకుంటే నా ఒళ్లు జలదరిస్తుంది. ఈ మురికికొంపలోపడి కొట్టుకోవడంకంటే ఏ పట్నానికో వెళ్ళి ఏ చిన్న వుద్యోగం......

మహా : ఐతే ఉన్న సొమ్ము, పూర్వులిచ్చిన ఆస్తీ పోగొట్టుకుని బస్తీకి బయలుదేరుతానంటావా ?

శంక : కాకపోతే, ఏదో ఒక అన్యాయంచేస్తూ ఎవర్నో ఒకర్ని హింసపెట్టడమేనా నా గతి ?

మహా : మంచో, చెడ్డో చేసేవాడికేగాని మడిగట్టుకుని ఇంట్లో కూచున్నవాడికి మంచినీళ్ళు పుడతాయటోయ్ !

[ కామేశ్వరి బైటనుంచి వస్తుంది. ]

కామే : మీకోసం ఎదురుచూస్తున్నారు, సింహాచలంగారింట్లో పెద్దలంతా !

శంక : మళ్ళా మొదలుపెట్టావ్ !

కామే : నా మాటంటేనే నీకు విషంగావుంది. ఆ వేలంవేసిన మరునాడుగాని మన బ్రతుకు బైటపడదు. ఊరునిండా బాకీలూ – పెళ్ళికెదిగిన పిల్ల......

[ సత్యం ప్రవేశం ]

సత్యం : ఏమిటత్తయ్యా మళ్ళా పేచీపడుతున్నారూ ?

కామే : మీకు తగిన మేనల్లుడే దొరికాడు. ఇక ఇద్దరూకలిసి నిర్వాకంచేస్తే మనగతి చెప్పక్కర్లా.

సత్యం : ఓహో ! మహాకాళి మహాశయా ! తమరెప్పుడు వేం చేశారు ? సరె సరి, తెలిసింది !

మహా : ఏమోయ్! క్షేమంగా వున్నావా? నీవు హాయిగా పెళ్ళిచేసుకుని ఒక ఇంటివాడివి కావాలని రోజూ భగవంతుణ్ణి ప్రార్థిస్తున్నా.

సత్యం : బంగారంలాంటి మాగాణి అయిదు యెకరాలమ్మించి, ఇప్పుడు ప్రార్థన చేస్తున్నావన్నమాట.

శంక : ఏమిటి సత్యం! మీ తగాదా ఇంకా తీరలేదా?

సత్యం : ఆయనతో తగాదాపడితే ఊరుకుంటాడా? కోర్టుకీడుస్తాడు. మా అమ్మా, నాన్నా పోకముందే ఊరంతటితో వ్యాజ్యాల్లోకి దించి, చివరికి నాకు ఊహావచ్చే సమయానికి చారెడు నేలైనా మిగలకుండా చేశాడు. ఇప్పటికి రాత్రింబగళ్ళు నా మనస్సు కలకవేస్తూనేవుంటుంది. పైగా నే నడిగితే నాకూ మీకూ ఇంతటితో రద్దన్నాడు. నేను దిక్కులేక ఈ వూరొచ్చి......

కామే : సత్యం, మీలో మీకు మనస్పర్థలుంటే వుండవచ్చుగాని, అవన్నీ మా ఇంట్లో వెళ్ళబోసుకోవాల్సిన పని లేదు.

మహా : అననీ యమ్మాయ్! అననీ. అంటే నా సొమ్మేం పోతుంది. నా డబ్బు—

సత్యం : డబ్బుకూ నాకూ లంకె.

మహా : శంకరం! నువ్వు వీడి మాటలు అనవసరంగా నమ్ముతావుగానీ, వీడి దావాకోసం ప్లీడరింటిచుట్టూ తిరిగి తిరిగి నా కాళ్లు పడిపోయినయ్యి, వీడికేమైనా కృతజ్ఞత వుందా?

సత్యం : మామా. ఇది విన్నావా ? అసలు మహంకాళితాత ఎందుకొచ్చాడనుకున్నావ్ ?

మహా : చూసిపోదామని.

సత్యం : మా వూళ్లో వాళ్ళందరినీ వ్యాజ్యాల్లోకి దించి ఊరు సగం నాశనంచేస్తే, అందరూ కట్టగట్టి బైటికి గెంటితే మూటా ముల్లే చంకనబెట్టి బ్రతుకు జీవుడా అని బయటపడ్డాడు. రెండు పార్టీలు ఏకమై వూరి పొలిమేర దాకా మహామ్మారిని తరిమినట్లు తరిమితే మళ్లా ఇక్కడ తేలాడు.

మహా : ఏమిరోయ్ ! నువ్వేమీ నన్ను గురించి చిలవలు పలువలుగా వర్ణించనక్కర్లేదు. నేను కామేశ్వరి కోసం, శంకరంకోసం చిన్ననాటి ప్రేమపోక వాళ్లు కష్టాల్లో వున్నారని విని......

సత్యం : నువ్వేమన్నా తప్పిస్తానంటున్నావా ?

కామే : సత్యం, మీ మామవున్నాడు, ఈయన వున్నాడు. ఏదో వూళ్లో అభిమానులంటూ వున్నారు. నువ్వు ఇందులో కొంచెం జోక్యం కలిగించుకోకుండావుంటే...

సత్యం : నన్నంత కేటాయింపుగా చూసి, మామయ్య మనస్సు మార్చేసి, సుందరని సింహాచలం కొడుక్కి కట్టబెట్టాలనికదూ నీ వుద్దేశం! ఈయనొచ్చాడుగదా మీ యిష్టాయిష్టాలన్నీ నెరవేర్చుతాడనుకున్నావేం ? నేనేం పనిలేక రాలేదు. మామయ్యతో మాట్లాడి విషయం తేల్చుకోవాలని వచ్చాను. సుందరి ఏదీ?

శంక : (నవ్వుతూ) సింహాచలంగారింటికి పేరంటానికెళ్ళింది...

సత్యం : మామా నీ కొకటే చెపుతున్నా......నువ్వు ఈ వూళ్లో కక్షలన్నీ చూస్తూనే వున్నావ్! ఏ ముఠాలో చేరినా నిన్ను వుపయోగించుకుంటారేగాని ప్రయోజనం లేదు.

మహాం : నలుగురిలోనూ తలెత్తుకు తిరగాలంటే నాలుగు చెయ్యాలి, నాలుగుపడాలి... పిల్లకాకి కేం తెలుసు వుండేలుదెబ్బ!

సత్యం : ఇదా నీ వేందాంతం!

శంక : (నిలబడి) మీకు ఈవూరి పరిస్థితి పూర్తిగా తెలియదు... ఎప్పుడో ఏడాదినించీ మాలపల్లిలో జీతగాళ్ళంతా కలసి, చెరువుకింద భూమి సాగుచేసుకుంటామని పిటీషను పెట్టుకున్నారు. సరే పైవాళ్ళచుట్టూ ప్రదక్షిణం చేస్తుంటే ఇక్కడ బ్రహ్మయ్యపార్టీ, సింహాచలం పార్టీ ఎత్తుకు పై ఎత్తులువేసి దాన్నెట్లాగైనా కాజెయ్యాలని చూస్తున్నారు. బ్రహ్మయ్య, కరణం కోర్టు చట్టాల్లో పుట్టి పెరిగినవాడు... సింహాచలం అంగబలం వున్నవాడు,పంచాయితీబోర్డు ప్రసిడెంటు... వాళ్ళిద్దరు నీచంగా...

కామే : అక్కడికి వెళ్ళడం మానుకున్నట్టేనా? లేకపోతే సింహాచలంగారే వస్తామన్నారు!

మహా : వెడదాం వెడదాం...కొంచెమాగు!

సత్యం : ఆయనచుట్టూ మూగాయితే వుందిగానీ, ఇంతొదున్న యీనిందంటే దూడను కట్టెయ్యను నేరకం! చెప్పు మామా నీవు చెప్పదలచుకున్నదేమిటో పూర్తిగా చెప్పు......

మహం : చెప్పబ్బాయ్! నువ్వు చెప్పేదంతా నిజమేకావచ్చు.

శంక : నిజమని తెలిసికూడా మరి నువ్వెట్లానలహా జెబుతావ్! చెరువులోభూమి బ్రహ్మయ్య ముఠావాళ్ళ పొలంలో కలుస్తుంది.... ఆ ఆశలో వాళ్ళకూ వీళ్ళకు లంచాలు మెచ్చాలని చూశారు. అది విని సింహాచలం పోతరాజు గుడికట్టిస్తానని బయలుదేరాడు. ఆ చెరువు మాలోళ్లు సాగుచేసుకుంటే ఏం? వీళ్ళకేం లేక చస్తున్నారా!

కామే : ఏదైనా వాళ్ళుబలగం వున్నవాళ్ళు...

శంక : దానిమీద రెండుముఠాలు ఉద్రేకాలు పెంచుకుని హఠాత్తుగా రాత్రిపూట కొట్టుకున్నారు. కూలీ లేం చేస్తారు.... పొట్టకళ్ళ పోట్లాడుకుంటుంటే...

సత్యం : జీతగాళ్ళని తొగించి, వాళ్ళచేత రయిటింగు చేయిస్తే అందులో నలుగురికి చేతులూ కాళ్ళూ విరిగినై...

శంక : ఒకరి మీదొకరు చార్జీలు పెట్టుకున్నారు....మాల వాళ్ళసంగతి ఆలోచనే లేదు...కలెక్టరును విచారణకు పిలుచుకురావాలని సింహాచలం పట్టుదల... ...

మహం : అవునులే, తెలిసింది....అయితే కథ పట్టులోవుందన్న మాట, నువ్వంటే సింహాచలం ప్రాణంగా మాట్లాడు తాట్టగా...

సత్య: ఈకేసు నడిపించడానికి మామయ్యతో అవసరమొచ్చింది.

కామే : అయన్ను బడికి మేనేజరుగా వేయిస్తామని కబురంపా డన్నయ్యా !

మహం : అలాగా ... బలే చాన్సు !

కామే : ఇప్పుడు సమయం మించితే మళ్ళీ మనల్ని పలక రిస్తారా ?

మహం : ముద్దొచ్చినప్పుడే చంకెక్కాలి గాని ... ఎటువంటి చాన్సు ! అరెరె ! ఎటువంటిచాన్సు !

శంక : ఎందుకు !

మహం : అడిగావ్ చెప్తానువిను. ఈ సమయంలోనే శెట్టితో గట్టిగా చెప్పించి జప్తు వ్యవహారం రద్దుచేయిద్దాం పూర్తిగా ... అసలు వడ్డీలతోసహా ...

కామే : అదొక్కటే ముంకు ...

మహం : ఏదీ మనవాడు కదిలితేగా !

సత్యం : నేనొక మార్గం చెబుతా ...

కామే : అంతకంటే ఉపాయంలేదు ... సత్యం నువ్వెందులో పట్టించుకోవద్దు.

సత్యం : అత్తయ్యా ఈ ఒక్కమాటా విను ... నేను తలతాకట్టు పెట్టయినా రెండువేలు తెచ్చిస్తా ... నువ్వు వడ్డీకి తిప్పు తున్న రెండువేలూ, పైన రావలసిన ...

శంక : రెండు వేలయిందా ...

మహ : అమ్మాయ్ ! డబ్బు లేదంటివే ... అట్లా అయితే జప్తు విషయంలో కోర్టుకే వెళ్లొచ్చునే .....

కామే : వెళ్ళి ఇదికాస్తా గంగలో పొయ్యాలనా (శం.తో)

అమ్మాయి పెళ్ళికోసం దాన్ని కదిలించకుండా వుండా లనా...

సత్యం : మామా! అయితే సుందరినిగురించి నువ్వు చేసిన వాగ్దానం!

కామే : అబ్బాయ్! నీకింతకుముందే చూచాయగా చెప్పా.. నీకు నువ్వు సంపాదించుకునేశక్తి లేనపుడు దాని బ్రతుకు నాశనం చెయ్యమంటావా?...మానాయన పుణ్యమా అని నేనీ యింట్లో పూట పూటకు పస్తులు పడుకుంటున్నా...

శంక : ఈ ప్రసంగాలు అనవసరం...సత్యం ఇప్పుడు నామనస్సు క్షోభ పెట్టకు... వెళ్ళు...

సత్యం : రెండునెల్లనించీ నీదయవల్ల బ్రహ్మయ్య ఇంట్లోనే పడు కుంటాను... ఇక్కడవుంటే పిల్లను మాయంచేస్తా నేమోనని...

మహా : పెళ్ళట! పెళ్ళి! తినటానికి తిండిలేదుగాని మీసాలకు సంపెంగనూనె! ఇంటిమీదకి జప్తు వచ్చిపడితే...

శంక : నేనే పార్టీలో చేరను...నాకీ బడిచాలు...ఈ జీతం చాలు...ఈ కష్టాలుచాలు...

మహాం : ఈకష్టాలు తొలగాలనే గదోయ్ మేమంతా నీకు...

శంక : మాతాత ఉన్నదంతా పార్టీతగాదాలకేబెట్టి దిక్కులే కుండా చనిపోయాడు ... బ్రహ్మయ్య ముఠా, మా నాన్నని నిలువునా ఖూనీచేసింది...

మహాం : పూర్వపు సంగతులన్నీ తలచుకుంటే కష్టంగానే వుం టుందనుకో, మరి ఈ బాకీలు, ఈజప్తు....

కామే : ఏదో ఒకటి చెయ్యండి ... చదువుకొన్నందుకు ఏదో ఒకవిధంగా న్యాయంగానో, అన్యాయంగానో ఈ దీపం నిలబెట్టండి.

[ సింహాచలం వచ్చాడు. కామేశ్వరి లోపలికి వెళ్ళింది. ]

సింహా : ఏం మహాంకాళీ! ఎప్పుడొచ్చావయ్యా! ఆకలి కాన డంలేదా! లేకపోతే రాదలచుకోలేదా, ఏమిటంతా ఇక్కడకూచొని మీటింగు చేస్తున్నారు... శంకరం బలేవాడివేనయ్యా! ఎన్నిసార్లు ఎంతమందిని పంపినా పొలకైనా కనబడదే, ఏం దాక్కునువుంటా వెట్లా... తేలే... పోదాం పదండి. సత్యమా! ఏంసత్యం నువ్వు గూడా రారాదూ, నువ్వెందుకొస్తావులే... బ్రహ్మయ్య ఊళ్లో వున్నాడా....

సత్యం : ఉన్నాడు...

శంక : వచ్చాడూ... పేటకి పోయ్యాడన్నార్లే ... పోలీసు సర్కిల్‌ను బుట్టలో వేసుకుంటానని ప్రమాణంచేశాట్ట! ఇప్పుడొచ్చిన సర్కిల్ యమాంతకుడయ్యోయ్! నేను మొన్ననే మాట్లాడి సరిచేశొచ్చా!

సత్యం : వాటితో నాకేం సంబంధంలేదు....

సిం : మంచిదేగా ...అట్లాగేవుండు ... కుర్రాడివి అమ్మా యేదీ అమ్మాయ్! కావమ్మగదూ!

మహాం : కామేశ్వరమ్మా!

సిం : ఏంటమ్మా ... పేరంటాళ్ళంతా నీకోసం ... పెళ్ళి పెద్దలంతా శంకరం కోసం కూచునుంటే...

కామే : వస్తున్నామన్నయ్యా ... బయలుదేరుతుంటే మీరొచ్చారు ... మంచినీళ్ళు కావాలా ?

సిం : మంచినీళ్లు ఇక్కడే తాగాలా ?... మాయింట్లో లేవూ? లేవయ్యా శంకరం, బయలుదేరవమ్మా!

మహా : లే అబ్బాయ్ ! సింహాచలంగారొచ్చారు. మళ్ళీ మనం ఆలస్యం చెయ్యకండా ...

సిం : ఊఁ పదండి పదండి (శంకరాన్ని చెయ్యిపట్టుకుని లేపుతాడు)

శంక : ఇప్పుడేనా ? అందరూ వచ్చారా ?

సిం : వచ్చారా ! ఎవడికోసం వస్తారు ! పద... అన్నాలొడ్డించారయ్యా ! .

శంక : రా, సత్యం వెళ్లొద్దాం...

మహాం : రా అబ్బాయ్ వస్తే... (మహాంకాళి సత్యం తప్ప అందరూ వెళ్ళిపోతారు)

సత్యం : రాకపోతే...?

మహాం : రానని చెప్పూ...

సత్యం : రాను...

[ మహాంకాళి వెళ్ళిపోతాడు. తనలోతాను నవ్వుకుంటాడు. బయటికి తిరిగి చూస్తాడు. సుందరమ్మ త్వరత్వరగా లోపలికి వస్తుంది. సత్యం ఒకమూల దాక్కుంటాడు. ఆమె కాళ్ళకు పసుపు పారాణి పెట్టుకుని, చేతిలో తాంబూలంతో వస్తుంది.................. ]

సుం : అమ్మా ! అమ్మా! (హఠాత్తుగా సత్యం రెండుచేతులూ చాచి ఎదుట నిలబడతాడు.)

సుం : అదేమిటి బావా ! అమ్మలేదు.

సత్యం : ఉంటే ఏం చేస్తుంది ? ఉరిపోసుకుంటుందా ?

సుం : అదిగో! అమ్మనట్లా తిరస్కారంగా మాట్లాడొద్దని చెప్పలా... నాకు బాగుండదు.

సత్యం : మరి మీా అమ్మ నన్నంటే చూస్తూ వూరుకుంటావేం?

సుం : నేనేం చేస్తాను చెప్పు...

సత్యం : నువ్వు తలూపుతుంటే వాళ్ళ యిష్టమొచ్చినట్లు వాళ్లు చేస్తారు . . . చివరికి వాళ్ళ తెలివి తక్కువవల్ల మనిద్దరం బాధపడవలసి వస్తుంది . . .

సుం : ఇప్పుడెందుకులే బావా ! నే నొప్పుకుంటేగదా!

సత్యం : సుందరీ ! నువ్వెంత తల్లిచాటుబిడ్డవైనా నేను భానను నీవు . . .

సుం : అదిగో. . . ఆ సంగతులొద్దు..

సత్యం : ఏం ఎందుకని? చెప్పు, కారణమేమిటి చెప్పు?

సుం : ఏం లేదు. . .

సత్యం : ఎవరేమన్నా అన్నారా ? చెప్పు, లేకపోతే...

సుం : ఊహు ఏంలేదు.

సత్యం : చెపుతావా చెప్పవా ?

సుం : నాకు సిగ్గుగా వుంటుంది.

సత్యం : ఓహో ! అయితే మాట్లాడను. నేనిప్పుడు పరిహాసం కోసం రాలేదు. ఇదిగో సుందరీ ! ఇకనుంచీ నేను మీా యింటి ముఖం చూస్తానో లేదో, మనిద్దరిని విడదీస్తా రేమో. . .?

సుం : ఏం, అమ్మనవద్దన్నదా ? ఏం జరిగింది ?

సత్యం : అనలేదు, ఇంకా అనలేదు. మీ అమ్మసంగతి నాకు తెలుసు. మహాంకాళి నన్నుచూస్తే వెర్రెత్తిపోతాడు.

సుం : మరెలా బావా?

సత్యం : నిన్నూ నన్నూ దూరం చేస్తారేమోనని భయంగా వుంది. నిన్ను సింహాచలం కొడుక్కిచ్చి పెళ్ళిచెయ్యాలని...

సుం : వాడితో నేనలు మాట్లాళ్లేదు.

సత్యం : నిన్నివ్వాళగూడా పలుకరించాడూ?

సుం : నేను జవాబివ్వకపోతే తెల్లముఖంవేసి వెళ్ళిపోయాడు.

సత్యం : సుందరీ! జ్ఞాపకం తెచ్చుకో. ఒకచోట పుట్టాం, ఒకచోట పెరిగాం. నేను ఒకరోజున మంటపందగ్గర చెడుగుడాడుతూ దెబ్బలుతగిలి రక్తం కారుతూ పడిపోతే నువ్వే తుడుస్తూ పరిగెత్తుకు వెళ్ళి ఇంట్లో చెప్పావ్, జ్ఞాపకముందా?

సుం : (తలూపుతుంది.)

సత్యం : ఆరాత్రి నువ్వన్నం తిన్నావా?

సుం : (మాట్లాడదు.)

సత్యం : తినలేదు గదూ?

సుం : (మెల్లగా) తిన్నా.

సత్యం : తినలేదు, అమ్మదొంగా...తినలేదు.

సుం : ఇప్పుడెందుకు బావా? వాళ్లొస్తారు.

సత్యం : అప్పుడుకూడా మీ అమ్మ నన్నే తిట్టిపోసింది. మనం తోటల్లో ఆడుకుంటే, ఇంట్లో, పొలాల్లో స్వేచ్ఛగా హాయిగా తిరుగుతుంటే వూళ్లోవాళ్లంతా ఏమన్నారు!

సుం : సత్యం పోకిరీ అన్నారు.

సత్యం : సుందరి మంచిపిల్ల అన్నారేం? మనిద్దగం పెళ్ళిచేసుకుంటే బాగుంటుందన్నారు. ఏం ప్రయోజనం, ఇక నా కెవరున్నారు చెప్పు? మీ అమ్మ ఇంట్లో వుండొద్దని ఎంత కఠినంగా చెప్పినా, ఈ వూళ్లో నా కాప్తులెవరూ లేకపోయినా, నీకోసం ఆ కరణం ఇంట్లోనే వున్నా...అప్పుడప్పుడు నిన్ను చూట్టానికైనా వీలుంటుంది గదాని...నువ్వుకూడా మీ అమ్మమాటలు విని దూరమైతే...ఇక నే నెక్కడెంకుకు, ఇక నేను జీవించెందుకు?

సుం : నాన్నకు నువ్వంటే ప్రాణం......నాన్న పట్టుబట్టితే మనం .....

సత్యం : అవును, కాని యీ జప్తుతో మీ నాన్న పూర్తిగా క్రుంగిపోయాడు. ఇప్పుడు వాళ్లు అనుకునిపెట్టి ఆశ చూపిస్తారు, మా పార్టీలో చేరితే జప్తు తప్పిస్తాం, గద్దెలెక్కిస్తాం అని. ఏమో మీనాన్న అక్కడ భోజనం చేస్తే అందులో చేరిపోయినట్టే...

సుం : మరి నువ్వు చెప్పు బావా! మీ యిద్దరూ చదువుకున్న వాళ్లేగా...

సత్యం : నే నింతకుముందే చెప్పాను. ఇందాక గట్టిగా వాదించాను. చెబితే తీరేకష్టాలు కావివి సుందరీ! ఇంతమంచి వాడు ఈ దుష్టులచేతుల్లో పడుతున్నాడే. తననూ తన సంసారాన్నీ నాశనం చేస్తున్నాడు. తప్పకుండా నిన్ను సింహాచలంకొడుక్కి కట్టబెట్టాలని చూస్తారు!

ఐతే సుందరీ, నా చేతిలో చెయ్యివేసి చెప్పు! నన్ను కలుసుకోవూ! మన చిన్ననాటి స్నేహం మరచి పోతావా ?

సుం : మరచిపోను బావా! కలిసే వుంటా...నిన్నే నిన్నే...

సత్యం : పెండ్లి చేసుకుంటా అను సుందరీ!

సుం : పెండ్లి చేసుకుంటా...

సత్యం : ఆ తాంబూలం నాకివ్వు. ఫర్వాలేదు. మనిద్దరం నేటి నుండి...అవునా ?

సుం : తీసుకో బావా! (తాంబూలం ఇస్తుంది.)

సత్యం : భార్యా-భర్తలం అవునా ?

సుం : (తలూపుతుంది.)

సత్యం : (గట్టిగా) అవునను.

సుం : అవును!

సత్యం : ఏం అవును. నోట్లో నాలిక లేదూ ?

సుం : ఏమిటా పరిహాసాలు. నాకు దిగులుగా వుంది.

సత్యం : అదే అదే, నా మనస్సులో దుఃఖాన్ని కప్పిపుచ్చాలనే నిన్ను నవ్విస్తుంటాను. యికనించీ మనిద్దరం బహిరంగంగా కలుసుకోవడానికి వీలుండక పోవచ్చు.

సుం : ఏం ఎందుకని, మరెలాగ ?

సత్యం : రోజూ సాయంత్రం వేళకు నీళ్ళబావి దగ్గరకొచ్చి మాట్లాడతా...సరేనా.

సుం : (తలూపుతుంది.)

సత్యం : సరే అను.

సుం: సరే.
సత్యం: తప్పకుండా అను.
సుం: తప్పకుండా.
సత్యం: ఇది నవ్వా ఏడుపా? ఈకాలం పిల్లవుకదూ...... నువ్వూ!
సుం: ఏమీలేదు!
సత్యం: ఏమీలేదు!
సుం: ఎందుకెగతాళి?
సత్యం: ఇదిగో! (అరచేతిలో ఏదో దాచిపెట్టి)
సుం: ఏమిటది?
సత్యం: చెప్పుకో.
సుం: నాకేం తెలుస్తుంది!
సత్యం: చెప్పుకుంటే ఇస్తా.
సుం: అదేమిటో ఇటివ్వు.
సత్యం: ఇవ్వకపోతే ఏంచేస్తావ్, మీ అమ్మతో చెప్తావా?
సుం: అదుగో, అందుకే.
సత్యం: చెప్తావా?
సుం: చెప్పను.
సత్యం: ఐతే తీసుకో, వుంగరం... వేలికి పెట్టుకో.
సుం: అమ్మ కోప్పడుతుంది.
సత్యం: ఇప్పుడు వేలికి పెట్టుకుని అమ్మ రాకముందే దాచి పెట్టుకో, సరేనా?
సుం: సరే!

[మహంకాళి బండారాల మాటతో, అరటిపండ్ల గెల పట్టుకొస్తాడు. భారంగా లోపలికి నడుస్తూ తీక్షణంగా వీళ్ళవంక చూస్తాడు......]

మహా : సుందరమ్మా! రా అమ్మా, ఇవి కొంచెం అందుకో

సత్యం : (ఎగతాళిగా) నే నోస్తానుండు.

మహా : వద్దులే వద్దులే, నేనే తీసుకుపోతాలే—

సత్యం : మహంకాళి అప్పుడే మోతపని మొదలెట్టేడు. మామ భోజనమయిందా అయన్ని ముంచాడు.

మహా : (లోపలనుంచి) యింకా లేదు.

సత్యం : ఇంకా ముంచలా!

మహా : (లోపలనించి) ఏమిరోయ్! గుడ్డొచ్చి పిల్లనెక్కిరించిందట!

సత్యం : (సుందరితో) తెలిసిందిగా! మామను వాళ్ళలోకి లాక్కుంటున్నారు. ఆ పద్మవ్యూహంనుంచి ఇటువంటి అమాయకుడు బయటపడలేడు. వాళ్ళ నాన్నకు పట్టినగతి అతనికి తప్పదు!

సుం : బావా! ఎలాగ బావా! నువ్వే కాపాడాలి, నువ్వే రక్షించాలి నాకోసమైనా...

సత్యం : నాకు తెలుసు! నేను ముందే నిశ్చయం చేసుకున్నా నేనేదో విధంగా బ్రహ్మయ్యతోనే కలిసివుంటా! వాళ్ళగుట్టు తెలుసుకుంటా.

సుం : ప్రమాణం చెయ్యి!

సత్యం : అలాగే—ఆయన నీకు తండ్రి, నాకు మామ పైగా గురుతుల్యులు. ఆయన కే ప్రమాదం రాకుండా నా

సాయశక్తులా ప్రయత్నిస్తా! వెడుతున్నా! సాయం త్రం బావికాడ ఎదురు చూస్తుంటా.

సుం : వెళ్లు...ఉండు బావా! ఉండు!

సత్యం : వద్దులే. వాళ్లొస్తారు (వెడతాను)

మహా : (బయటికి వచ్చి) అమ్మాయ్! ఈడొచ్చిన పిల్లవి ఇట్లా వాడితో...

సుం : (కోపంగా విసురుగా లోపలికి వెళ్ళిపోతుంది)

మహా : సింహాచలంగారితో చెప్పాలే...మా పిల్లకు హార్మోనియంవచ్చు, కుట్టుపనివచ్చు, హిందీవచ్చు. ఆ మూాడు ముళ్ళూ వేస్తేగాని నీ టెక్కు కుదరదులే.

సుం : (లోపలినించి) చాల్లే! వూరుకో...

మహా : ఊరుకుంటా...ఊరుకుంటా (బయటకి తిరిగి) అదిగో చూడు! సింహాచలంగారు మనవాడి భుజాలమీద చెయ్యివేసి ఆప్యాయంగా, మర్యాదగా, గౌరవంగా... ఆహా! ఇక ఈవూరి నేలేది మనం (నేలితో తన గండెను చూపిస్తాడు)

సుం : నోర్మూయ్! బుద్ధిలేదూ!

మహా : (ఆమాటకు నిర్ఘాంత పోతాడు.)

[ తెర జారుతుంది. ]

---

# మాపూరు

## రెండవ రంగం

---

[మూడు నెలల తర్వాత: అదే ప్రదేశం, పగలు 10 గంటలకు మహాంకాళి ఒక్కడే కూచుని దస్తరం అంతా తిరగేసి చూస్తుంటాడు. కళ్లద్దాలు పైకీ క్రిందికీ మార్చుతుంటాడు. వెండిరేకులు వేసిన కేప్‌తో వున్న కలం తెరిచి అటూ ఇటూ చూసి ఏదో జాగ్రత్తగా రాస్తుంటాడు]

కామే: ఏమిటి మామా ప్రొద్దుటనించీ పనిచేస్తున్నావ్.

మహా: (వేలిముద్దర వేస్తూ) ఆఁ...కలెక్టరుగారొస్తున్నారా! కేసు రికార్డులన్నీ తిరగే...అసలు కథేమిటో వంట పట్టించుకుంటే...

కామే: ఆయనింకా రాలేదే! పదిగంటలు కాలా?

మహా: పోయినపని కాకుండా ఎట్లా వస్తాడు! కలెక్టరుగారిని క్యాంపుకు కదిలించడమంటే సామాన్యమా?

కామే: మామా! కలెక్టరుగారిని మన ఇంటికే భోజనానికి రప్పిస్తే ఎంత గౌరవంగా...

మహా: (తలూపుతూ) ఆగు, కొన్నాళ్ళాగు, మనవాడే బోర్డు ప్రసిడెంటయితే ఈ తాలూకా అంతా శ్రీకృష్ణుడిలాగ చిటికినవేలున తిప్పుకురానూ!

కామే: (తృప్తిగా నవ్వుతూ) సింహాచలంగారు ఈయన్నడక్కుండా అడుగుతీసి అడుగు పెట్టడు.

మహా : ఎవరికోసం... నేను జాతకంచూసి గ్రహాలు లెక్కవేసి మాటంటే ఇక అది తప్పుతుందా-చూస్తావ్-నీవే చూస్తావుగా.

కామే : మామా! నాకేమిటో ఆయన ధోరణి అర్థంకరకంగా లోలోపల కుమిలిపోతున్నట్లు, రాత్రిపూట కన్ను ముయ్యడంలేదు.

మహా : అలవాటు కావాలి...ఏదీ మూడునెల్లేగా అయింది. పార్టీలో చేరితే కొన్ని పద్ధతులకు అలవాటు పడాలి. ఏమిటి చూస్తున్నావ్! అమ్మాయి కోసమా.

కామే : ఆ, అదే మామా! పొద్దున పోయింది ఇంతవరకూ రాలేదు...ఇంట్లో పనంతా ఎదురు చూస్తున్నది... ఎక్కడ పెత్తనాలు చేస్తున్నదో...

మహా : మళ్ళీ వాడేమన్నా పిలుస్తున్నాడేమో...అసాధ్యుడు!

కామే : ఏమో. రెండునెల్లనించి కట్టిపడేశాం...ఆ సత్యానికి మాత్రం బుద్ధి వుండక్కర్లా... మొన్నటి రోజున బావి కాడికి రమ్మని కుర్రకుంక చేత చీటీ పంపితే నాలుగు జామకాయలిచ్చి లాక్కున్నా. పోట్లాడితే నాకు తెలియ దంటుందే! ఇక ఆ రోజంతా ఏడుస్తూ కూచుంది.

మహా : చీటీ పంపాడూ...నాకు తెలుసునమ్మాయ్! వాట్టి మిడిమేళపు రకం.

కామే : ఏమో మామా నాకంతా అయోమయంగా, భయంగావుంది. ఈ చిక్కులన్నీ...

మహా : ఇవాక చిక్కులా-చూడు! ఇటువంటి చిక్కులతో నాతల

నెరిసిపోయింది! ఏం మనవాడిప్పుడు లైబ్రరీ ప్రెసిడెంటు కాలా? ఆ గవర్నమెంటు గ్రాంటు కాస్తా...

శ్యామే : దాని తాళం తుప్పుపట్టి పోవడమేగాని... తెరిచే దిక్కులేదని...

మహా : ఇహానించీ తెరిపించొచ్చు... ఇప్పుడు ఆ జప్తు తాలూకు వేచీయేగాని చిల్లరబాకీలన్నీ తీరిపోయినయ్‌గదా... లక్షణంగా ఒక జీతగాణ్ణి పెట్టాం! మొన్న నేగా పిల్లకు లోలాకులు, నీకు కమ్మలు, ఉగాదికి రెండు దాపుడు చీరలు...

శ్యామే : నిజమే మామా! నిన్ను మరిచిపోతామా!

మహా : అమ్మాయ్! నీ యింటికి సిరి యెత్తుకుంటుంది చూడు. సంకురాత్రికల్లా ఈ కేసు ఫైసల్ అయితే మనవాణ్ణి వచ్చే ఎలక్షన్‌లో యమ్. యల్. ఏ. గా నిలబెట్టాలి. సరేగాని... తీరావచ్చి నన్నిందులో దించారుగదా... ఏమీ లేదమ్మాయ్! నా రెండెకరాల తాకట్టూ తప్పిస్తే ఇక ఈ జీవుణ్ణెక్కడ వదిలినా పరవాలేదు.

శ్యామే : అట్లాగే... దసరా నాటికి...

మహా : అయితే ఇప్పుడు వీల్లేదంటావా! (నవ్వుతూ) నీ డబ్బంతా వాడ్డీలమీదే వుందికామాలు... అసలు నా ఆంతర్యం చెప్పొద్దు... ఆ తాకట్టుపీడ కాస్త వదిలిస్తే... ఆ రెండకరాలు అమ్మాయి పేరిట పెట్టి...

శ్యామే : నీ మేలు మరచిపోలేం మామా! పైరైతే అయానది కాని ఇకనించి అన్నిటికీ నువ్వే పూనుకుని ఎక్కడికక్కడ పిండకపోతే...

మహా : నువ్వాడగాలా....తప్పకండా......(నశ్యం వేసుకుంటూ) ముందీ సంగతి చెప్పు! ఎంత అడుగుదాం...కరణం బ్రహ్మయ్య ఇప్పుడొస్తాడు.నన్ను వేధిస్తున్నాడమ్మాయ్!

కామే : మనమట్లా డబ్బుతీసుకుని కేసు రహస్యాలు చెపితే న్యాయంగా వుంటుందా ?

మహా : సరేలే! ఈ యింట్లో ప్రవేశించినప్పట్నుంచీ న్యాయా న్యాయ విచారణతోనే కాలం గడుస్తున్నదిగాని, నాలుగు డబ్బులు మీరు రాల్చుకోరు. నన్ను రాల్చుకో నివ్వరు !

కామే : పోనీ ఆయనతో చెప్పిచూద్దామా ?

మహా : ఆయనతో చెపితే అసలుకే మోసంవాస్తే! మనవాడు ఇంత లోతుగా ఆలోచించలేడమ్మాయ్. ఇప్పుడొస్తాడు, నీ కిష్టమేనా ?

కామే : నీవు మంచిదనుకుంటే !

మహా : మంచేమిటింకులో! మనవాడొచ్చేలోపలే యీపని పూర్తిశావాలమ్మాయ్ !

(లోపలనుండి "ఏమండీ మాష్టారుగారున్నారా ?")

కామే : ఎవరో పిలుస్తున్నారు !

("మాష్టారుగారు ఫూరినుంచి రాలేదాండి ?")

మహా : వాడు వెంకాయ్‌గదూ ?

కామే : ఆఁ కూలీలే... ఇక్కడికెందుకొచ్చారు ? మళ్ళా ఏం వుపద్రవం వస్తుందో !

మహా : ఏమీలేదు. నువ్వు లోపలికెళ్లు. నేను మాట్లాడతాను.

కామే : వాళ్ళతో మాట్లాడేదేమిటి? వాళ్లు లాలూచీ గకం కాక — ఈ రెండునెల్లనుంచీ ఇంటికి రానివ్వలేదని కోపంగా వుంటారు.

మహా : ఇటువంటివె వాళ్లెంతమందిని నడుపుకొచ్చాను. నేను సమాధానం చెపుతా... లోపలికి నువ్వు పో.

కామే : త్వరగా పంపించు. (లోపలి కెళుతుంది)

మహా : ఎవర్రా అక్కడా?

వెంకయ్య : మేమేనండి కూలీలం.

మహా : ఓహో! నువ్వట్రా... వెంకాయ్, లోపలికి రా.

[ వెంకయ్య, యేసోబు లోపలికొస్తారు. ]

మహా : మరి నల్లపూసలయ్యారేమోయ్... బాగున్నారా?

వెంక : తమ చలవవల్ల ఇట్లా ఇట్లా...

యేసోబు : అంతా మీ పుణ్యమే బాబు...

మహా : మనదేముందోయ్, ఆరోజేం జరుగుతుందో మానవ మాత్రులకు మనకేం తెలుస్తుంది.

వెంక : కరికి టుకుగా రొస్తారని పుకారుగావుంది. నిజమేనా బాబు?

మహా : అవును. పిలిపిస్తున్నాం. ఈపాటికి రావలసింది. ఏం సంగతి...మీరేమన్నా చెప్పుకోవాలా? ఏర్పాటు చేయిస్తాను.

యేసో : అది సరేబాబు! ఆ కొట్లాటనాడు ఉట్టిపున్నానికే మావోళ్లు నలుగురికి చేతులు విరిగినయ్యేగదా బాబూ!

మహా : ఊరికే చేతులెట్లా విరుగుతాయ్‌రా! వీళ్ళు తల పగలగొడితే వాళ్ళు చేతులు విరగ్గొట్టుంటారు!

వెంక : అదేంటి బాబూ ! జీతగాళ్లుగదాని మా వాళ్ళను అమాయకుల్ని చేసి, సింహాచలంగారు పూరాగా తాగించి ఈ దొమ్మీకి పంపితే ఇట్టా జరిగింది. అసలు మాకు రావాల్సిన భూమేమిటో, ఈ రెండు పార్టీలు తగాదా లాడుకోవడమేమిటో, పైగావాళ్ళని ఇంకులో ఇరికించడమేమిటో...

యేసో : చేతులిరగ్గొట్టి పున్నెం కట్టుకున్నారు. పైగా మమ్మల్నొచ్చి దొంగసాచ్చం చెప్పమంటున్నారు !

మహా : అయితే ఏమంటార్రా ?

వెంక : ఏమంటాం ! పంతులుగారికి చెప్పుకుందామనొచ్చాం.

మహా : అతనైతే ఒకటీ నేనైతే ఒకటా ! నాతో చెప్పండ్రా !

యేసో : ఆయనగారైతే...

మహా : న్యాయంగా ఏదైనా చెయ్యగలిగితే మేం చేస్తాం... త్వరగా చెప్పండి. నే చేయిస్తాగా ... ఇప్పుడొచ్చిన కలెక్టరు అసలే ధూం ధాం మనిషి.

వెంక : మావాళ్ళంతా ఈ విచారణలో నిజం చెప్పమన్నారు బాబూ......

మహా : అంటే ?

యేసో : జరిగింది జరిగినట్టు......

మహా : అంటే జరిగిందేమిట్రా ... బ్రహ్మయ్యముతా సింహాచలం ఇంటిమీద పడలా ?

వెంక : అదేంటి బాబూ...

యేసో : కళ్ళంబండదగ్గ ్గిగ దొమ్మీ కొట్లాట జరిగింది !

మహా : రచ్చబండదగ్గర మాటమీద మాటనుకున్నారు...
తర్వాత సింహాచలం ఇంటిమీద పడి...

వెంక : అప్పుడు మీ రెక్కడున్నారు బాబూ!

యేసో : ఇదేం నాయం బాబూ !

వెంక : మాకు తెలుసు బాబూ! మీ రేం చెబుతారో.....
బమ్మయ్య మునా ఏం చెబుతాడో అన్నీ మాకు తెలుసు. మేము నిజం చెప్తాం. ఏం సింహాచలంగారు మా కొరిగించాడా...సూడండి. ఆకాశరామన్న ఉత్తరాలు రాయించి, మమ్మల్ని ఖూనీచేస్తానని బెదిరిస్తున్నాడు. (జేబులోంచి తీస్తాడు.)

యేసో : మేమేం ఆయన మోచేతినీళ్ళు తాగుతున్నామా, ఆయన తరఫున చెప్పడానికి. మాకు రెండు పార్టీలూ ఒకటే. యెంత పార్టీలోచేరినా మాస్టరుగారికి మామీద దయ లేకపోతుందా,

మహా : ఏదీ చూడనా...రాశారా! ఎవరు రాశారూ?

వెంక : మీరే సూడండి. ఇవి ఆయన రాసినవేనండీ, ఆయన నోరులేని మనిషినిచేసి మీరంతా రాయించి...

మహా : చాలు చాలు, ఏం మర్యాదోయ్...నా ముఖం నేనెన్నడైనా చూశానా. నేను రాయించడానికి. (దాన్ని చూస్తూ) అతని దస్తూరి కాదోయ్!

వెంక : మాకు గుర్తేనండి. ఇంత అన్యాయానికి పూనుకోవద్దని సెప్పుకోటాని కొచ్చామండి!

యేసో : ఆయనమీదింకా నమ్మకం పోలేదండి.

వెంక : ఇది ఆయనకు పుట్టినబుద్ధి కాదండి. మేము ఆయన్ను బాగా ఎరుగుదుం.

మహా : అలాగేం! అతనింకా రాలేదే. వస్తే బాగుండేదోయ్. బహుశా కలెక్టరుగారు ఇవాళ రారేమో...

వెంక : అయితే మళ్ళీ వస్తామండి, వచ్చెల్లామని చెప్పండి...

మహా : ఒకవేళ ఇప్పుడే కలక్టరుగారు ఒస్తే... ఇది చూపించాలనా?

వెంక : ఔనండి!

మహా : ఎందుకూ మన శంకరం రాగానే అర్జెంటుగా కబురు పంపుతా, వచ్చి మాట్లాడండి! ఇది చాలా అన్యాయం కదూ. అయినా మీకు రాయడమేమిటి; అన్నం పున్నం ఎగనివాళ్ళకి...

వెంక : అదేనండి.

మహా : సరే వెళ్ళండి!

వెంక : ఆ పుత్తరం ఇయ్యండిమరి...

మహా : ఇదా...వుండనియ్. అతనురాగానే మాట్లాడుతా,

వెంక : మేమొచ్చి చూపించుతాం.

మహా : (ఆప్యాయంగా నవ్వుతూ) నేనేం పారిపోతానటోయ్. అతను రాగానే కబురంపుతా. మీరూ మీరూ సెటిల్ చేసుకోండి, వెళ్ళండి.

యేసో : అయితే యిదిగూడా జాగర్తగా వుంచి ఆయనగారు రాగానే మాట్లాడండి బాబూ.

మహా : ఇంకా వున్నయ్యా! ఏవీ, యిటివ్వు.

వెంక : తర్వాత ఒస్తాంలేండి.

యేసో: ఫర్వాలేదులేరా......నమ్మించి మోసం చేస్తారా?
(మిగిలినదికూడా ఇచ్చేస్తాడు.)

వెంక: అయితే వస్తాం బాబూ!

యేసో: దణ్ణాలు బాబూ!

మహా: రామార్పణం. (వాళ్లు వెళ్ళిపోతారు.)

కామే: (ప్రవేశించి) బలేపని చేశావు మామా!

మహా: మెల్లగా అంటావేం—మనాడు. మనవాడు రాసినవి చూడు, స్వదస్తూరితో రాస్తారా!

కామే: సింహాచలంగారు రాయమంటారు.

మహా: అయితే మన తెలివితేటలు ఏమయినై?

కామే: ఆయనను పూజింపుదాం, జాగ్రతగా వుంచండి.

మహా: బలేదానివే! భార్యాభర్తలకు సరిపోతుంది. (ఆ కాగితాలు చింపుతాడు) బ్రహ్మయ్యొస్తున్నాడు! అమ్మాయ్ ఏమాత్రం మూతి బిగించుకునేవ్, సామాన్యుడుగాడు.

[బ్రహ్మయ్య మెల్లిగా అడుగులు వేస్తూ, లోపలికి ప్రవేశిస్తాడు.]

మహా: రా బావా! మనవాడింకా రాలేదు.

కామే: రండి! కూర్చోండన్నయ్యా—ఏకో దోవతప్పి వచ్చారు.

బ్రహ్మయ్య: ఎంతమాట! మనస్సులో వున్నది బయటికి కనిపిస్తుందా? మీరే చూస్తారుగా... బాగా ఇదిగో లంక పుగాకు చుట్టలు, ప్రత్యేకంగా చుట్టించాను. నీ దగ్గరుంచు. (తీసి చుట్టలు ఇస్తాడు.)

మహా: అబ్బే నేను ముట్టను. మనకింటులో బ్రాహ్మణీయమే నచ్చింది.

బ్రహ్మ : అలాగా, అయితే ఇదిగో, ఉంచవయ్యా ప్రత్యేకంగా అన్ని దినుసులూ కలిపి నీ కోసమని నెయ్యివేసి చేయించా...

కామే : మంచినీళ్లు కావాలా ?

బ్రహ్మ : ఎందుకమ్మా... పోనీ నువ్వడిగావుగనక ఒక్కచుక్క మజ్జిగ రానివ్వు. ( ఆమె లోపలికి వెళ్ళబోతుంది. ) కామేశ్వరమ్మా! నీకడుపు బంగారంగానూ రావమ్మా. ఇదిగో ఈ కవరు నీదగ్గరుంచి... జాగ్రత్తగా — మీ ఆయన రాగానే లెక్కపెట్టుకోమను.

మహా : ఏమిటది ?

బ్రహ్మ : ఏం కవరు లేదులే, డబ్బయ్యా...

మహా : ఎంత ? తీసుకోఅమ్మా— లేకపోతే వూరుకుంటాడా ?

బ్రహ్మ : అసలు మీ ఆయనకు ఈ వ్యవహారాలు తెలియ వమ్మా ! ఆనాడు అట్లా నెట్టినచ్చి దౌర్జన్యం చేయించాడని కాకిచేత కబురంపితే వాణ్ణే వాడి వ్యాపారాన్ని ఇంజక్షనిచ్చి ఆపించకపొయ్యానా !

మహా : కరణంగారు ఎంతటికైనా సమర్థులు.

బ్రహ్మ : ముందిది దాచిపెట్టిరా చెబుతా...

[ కామేశ్వరి లోపలికి వెళుతుంది. ]

మహా : మీరు కలగచేసుకుంటూండబట్టే ఊరంతమాత్రంగా వుంది.

బ్రహ్మ : కాని వూళ్లో వాడేమిటో తెలుసా— నేను, ఆ మునసబు మైనరుకావడంవల్ల అసలువాళ్ళని కట్టుకుని నేనేదో నాటకమాడుతున్నానని... ఆ... మొన్న పదేకరాలు

కొన్నానంటే — సెంటుభూమి లేనివాళ్ళంతా కడుపు మండి—చల్లారక నోటికొచ్చినట్టు కూస్తుంటారు.

సుహా : ఆ...అలకాజనం అట్లానే అంటారు. వాళ్ళ నోటికి తాళమేముంది! మీ సంగతి అందరికీ తెలుసు.

బ్రహ్మ : ఎందుకు తెలియదు. తెలియకపోతే తెలియపరుస్తానయ్యా...ముసలమ్మలాగ మూల కూర్చుంటామా? మరేమిటి? మన వ్యవహారం తేల్చు - మళ్ళా కలెక్టరుగారొస్తే తుమ్మడానిక్కూడా వైలుండదు.

[ కామేశ్వరి వస్తుంది. ]

సుహా : అలాగే చేద్దాం, మనవాడితో ఆలోచించి...

బ్రహ్మ : ఆలోచన! ఆలోచనేమిటయ్యా చెయ్యాలి చెయ్యకపోతే చేయించాలి....ఇదేం బొమ్మలాటగాదు...... ఏమంటావమ్మాయ్! మనమొక ఒప్పందానికొచ్చిన తర్వాత అనుకున్న ప్రకారం జరిగించాలా అక్కర్లేదా!

కామే : ఒప్పందమా? నాతో మీరెప్పుడు చెప్పారు?

బ్రహ్మ : వేరే చెప్పేదేమిటి? ఇప్పుడు చెప్పానుగా? అదే! అసలు వ్యవహారమేమిటంటే, ఇప్పుడు విచారణలో ఒక్కొక్కరినే పిలుస్తారుగాని ఈ మూకనంతా పిలవరు. సరే మా తరఫున మేం చూసుకుంటాం...ఈ వైపునుంచి...అంటే సింహాచలం తరఫునుంచి బలమైన సాక్ష్యాలు ఉన్నాయి...ఉండేదేమిటి సిద్ధం చేశాను. వాళ్ళెంత ఖర్చుపెట్టినా, ఎంత వెర్రికేకలేసినా, అసలు కీలకం శంకరంచేతిలో వుంది. అతనితో చెప్పి, ఒప్పించి మన తరఫున అక్కర్లేదు... తెలిసిందా...వాళ్ళారోజున

తాగి వున్నారనీ... అసలు కొట్లాట మా ఇంటిదగ్గర గుమ్మంలో...న్యాయంగా అంతేగదండీ... గడపమీద నెత్తురు చూపిస్తా కావాలంటే... తెలిసిందా ఆవిధంగా చెబితే అదే పదివేలు...

మహా : మరి అతనే కలెక్టరుగారిని పిలుచుకురావడానికి వెళ్లేడు గదా...

బ్రహ్మ వెడితే వెడతాడు... అనేకముంది పిలుస్తారు. ఈయన పిలిస్తేనే వస్తున్నాడంటావా.. ఏమిటయ్యా నలుగురు మనుష్యులు గాయపడి యదార్థంగా సాక్ష్యం కనబడు తుంటే.

కామే : వాళ్ళంతా మాలాళ్లే గదండీ!

బ్రహ్మ : లేకపోతే నేను కర్రతీసుకుని పోట్లాటకు పోతాన టమ్మా! అంత చేతకాకుండా వున్నానా ?

మహా : లేకపోతే...చూడండి. ఇప్పుడట్లా వాదిలేసి తర్వాత కోర్టులో మనకెట్లా అవసరమైతే అట్లా...

బ్రహ్మ : ఓహో! బాగుంది నీ సిద్ధాంతం–ఇవ్వాళే ఇక్కడే చెప్పాలి. లేకపోతే కేసే మోపైపోతుంది–నేనేం ఊరికే ఉపకారం చెయ్యమనటంలేదు–ఏం బావా! ఇదేనా ఎట్లా...

మహా : అలాగే చేద్దాం బావా! అయితే చూడు....

[ సుందరి వస్తుంది. కామేశ్వరి వెళ్లిపోతుంది. ]

ఇది బైటికి పొక్కితే మావాడి ప్రాణానికే ముప్పు వస్తుంది.

బ్రహ్మ : మనమంత చేతులు ముడుచుకుని కూచున్నామయ్యా ...అసలు మీావాడికి మంచి చెడ్డలు తెలియవయ్యా... నా పార్టీలో చేరితే నే మా తాసిల్దారుతో చెప్పి ఏదో ఒక కోటా వేయించకపోయానా. నాలుగేళ్ళలో లక్షల కధికారి కాకిపోయ్యాడా.

మహా : నిజమే బావా! నువ్వెప్పటికైనా మమ్మల్నొక కంట కనిపెట్టుండాలి...

బ్రహ్మ : రెండు కళ్ళతో కనిపెట్టుంటా... మనసంగతి తేల్చు.

మహా : బావా! బావా! నా పరిస్థితికూడా నీకు తెలుసు.

బ్రహ్మ : నీకేం మహారాజుగా వున్నావ్—ఇప్పుడీ ఊళ్లో తతంగ మంతా నీ చేతిమీాదుగానే నడుస్తున్నదిగా...

మహా : ఎంతమాట బావా! మీావంటి పెద్దలంతా వుండగా...

బ్రహ్మ : అసలు విషయమేమిటో బయటకి రానివ్వు.

మహా : అదికాదు బావా —— నాది రెండెకరాల మాగాణి తాకట్టులో వుంది....

బ్రహ్మ : అది నేను చూస్తాలేవయ్యా—సరేనా—శంకరాన్ని ఒప్పుకురా ముందు.

కామే : (బయటికివచ్చి) ఏం మామా! ఆయన్నొప్పించడం కష్టం!

బ్రహ్మ : ఏమిటీ!. మహా చక్కగా ఒప్పుకుంటాడు...మీారొ ప్పించాలి.

మహా : అలాగే బావా! నువ్వడిగితే తప్పుతుందా!

కామే : అలాగేలెండి!

బ్రహ్మ : అయితే ప్రమాణం చేస్తారా! ఇదిగో నట్టింటిలో నిలబడున్నాం... దానర్థమేమిటో తెలుసా...ఇక్కడ సాక్ష్యం తేల్చి చెప్పడమే కాకుండా హైకోర్టుదాకా జాగ్రతగా రహస్యంగా అంటే మనకనుకూలంగా నడుచుకోవాలన్నమాట.

మహా : ఇంకో రెండువేలకనికీ... నాకూ

బ్రహ్మ : హు! చూస్తాంలేనయ్యా—ఏ వృపకారం ఉంచుకోంలేనయ్యా!

మహా : ఒక వెయ్యి అననయ్యా నీకేం...

బ్రహ్మ : ఘటికుడివయ్యా—అలాగే తీసుకో నా డబ్బెంతమంది తినలేకు!

మహా : ఈ విషయం మానవమ్మాయికి తెలియగూడదు... శంకరానికగ్గాడా... వెల్లడైపోతుంది.

బ్రహ్మ : మీ జాగ్రతలో మీరుండండి (వెళ్ళిపోతుంటే శంకరం వస్తాడు. అలిసిపోయి ఉంటాడు)

మహా : అమ్మాయ్, స్నానానికి నీళ్లు పట్టు...శంకరం వస్తున్నాడు!

శంక : (వస్తాడు) బ్రహ్మయ్యగారా వెళ్ళిపోతున్నది?

కామే : బాగా అలిసిపోయినట్టున్నారు.

మహా : ఏంటబ్బాయ్, రాత్రి నిద్రలేదా? ఎప్పుడూ ఇంత బలహీనంగా కనబడలేదమ్మాయ్...

కామే : హోటలు అన్నం సహించలేదేమో...

మహా : బాగమేగా వెళ్ళి.

శంక : మర్యాదలైపోయినయ్యా-కరణం బ్రహ్మయ్య ఇక్కడి కెందుకొచ్చాడూ...

మహా : ఏడీ... ఇక్కడి కెందుకొస్తాడూ...

శంక : గుమ్మంలో ఎదురుపడ్డాడు-రాలా కామేశ్వరీ...

కామే : ఏమో మరి-బయటనుంచి ఎవరో కేకవేస్తే లేరని చెప్పాం.

మహా : సత్యం కోసమేమో...

శంక : సత్యం! వాడిసంగతి నాదగ్గర తేవద్దు-వాడు నన్ను గురించి అక్కడాఅక్కడా వెర్రిగా మాట్లాడుతున్నాట్ట!

మహా : నీదాకా వచ్చిందీ-వాడి తత్వం మంచిదికాదబ్బాయి.

కామే : సింహాచలంగారొస్తున్నారు-మీరు వెంటనే స్నానం చేసి భోజనం చెయ్యండి-మళ్ళీ తీరిక ఉండదేమో...

మహా : అమ్మాయి... వెళ్ళు! నీళ్ళుపట్టు.

సింహా : (వచ్చాడు) వచ్చాడూ! చెప్పారుంటే మనవాణ్ణి చెప్పుకోవాలి-టంచన్‌గా చెప్పుకున్న సమయానికే కలెక్టరుగారిని రప్పించేస్తున్నావే!

శంక : వారికన్ని ఏర్పాట్లూ జాగ్రతగా చేయించారా!

సింహా : ఏదీ మనలనందుకో అడుగు పెట్టనిస్తేనా? నేను బళ్ళో ఏర్పాటుచేస్తే బ్రహ్మయ్య గుళ్ళో ఏర్పాటు చేశాడు-వాడు కరణం...సరే వాణ్ణే ఏడవనివ్వాలే అనుకున్నా.

శంక : సాక్షు లేమంటున్నారు?

సింహా : ఒక్కణ్ణి తల ఇటు తిప్పమను, వాళ్ళు పగులుతుంది-

రాత్రినించీ మాలోళ్ళందరిని మన దొడ్లోకితోలి కది లితే ఢొక్క చీలుస్తా మన్నా!

మహా : సాతులోళ్ళక్కర్నే పిలిచి రహస్యంగా విచారణ చేస్తారేమో?

సింహా : చెయ్యనియ్యవయ్యా మనకేం...చక్రం తిప్పేది మన వాడు శంకరం కదా... చెల్లీ కామేశ్వరమ్మా!

కామే : (వస్తుంది) అన్నయ్యా! ఈపూట ఇక్కడే భోంచె య్యండి...ఇద్దరూ కలిసి నేరుగా పోవచ్చు

సింహా : మా చెల్లెలుయుక్తి చూశారా! తొందరొద్దులే నాలుగురోజు లాగనియ్యవయ్యా వియ్యాలందుకున్నాక మీారే మా యింట్లోపడి తింపురుగాని.

శంక : పదండి... నేను తర్వాతొస్తా...

సింహా : ఇద్దరం కలిసే పోదాం-అమ్మాయ్ ఇదిగో ఇది నీ దగ్గ రుంచు (మహంకాళి అందుకోబోతాడు) ఉండనయ్యా పెద్దమనిషీ ... వారిచేతికి అందిస్తే అక్కడికి నా బాధ్యత తీరిపోతుంది.

కామే : వారికివ్వండి (భర్తకు)

సింహా : ఉంచు శంకరం, ఇంట్లో అవసరాలకు...

శంక : ఏమిటది?

సింహా : రెండువేలు కావాలని చెప్పి పంపావుగా...నిన్న వసూలయ్యేప్పటికే పొద్దుకూకింది.

శంక : నేను చెప్పి పంపలేదే...

కామే : మీారు నాతో అంటిరే...

శంక : వారినడగమన్నానా?

సింహా : అడిగితే ఏమయ్యా ... అవసరమనేది ప్రతీవాళ్ళకు ఉంటుంది. వుంచుచెల్లి ... నీవు తీసుకో ...

కామే : (తీసుకుంటుంది)

శంక : నీవుపోయి సింహాచలంగారితో చెప్పావన్నమాట.

మహా : బాగుంది_మధ్యలో నాకేం ఒరిగింది...ఏదో పాప మని...

శంక : అక్కర్లేను_మీదగ్గరే వుంచండి.

సింహా : అమ్మాయ్! వానవాడు విన్నట్టులేడుగాని ఇటువ్వు చెబుతా.

కామే : పర్వాలేదులే అన్నయ్యా-

సింహా : కాదులే ఇటివ్వు నేను మీదగ్గిర అప్పుగా పుచ్చు కున్నట్టు రాసుకుంటూ మామూలు వడ్డీ వేసుకుం దాంలే...

మహా : సింహాచలంగారికి_యీ డబ్బె లావాలొచ్చిందా-

సింహా : కాదులేవయ్యా_నేను ముందే అనుకున్నాను.

కామే : (ముఖం మాడ్చుకొని) ఇప్పుడు తీసుకుంటారా?

సింహా: ఎప్పుడైతేం_ఇప్పుడే యివ్వు_అమ్మాయ్ మీ ఆయనకు అన్నం పెట్టమ్మా పోతాం.

శంక : కానివ్వు!

సింహా: శంకరం విన్నావో లేదో _ ఆ కూలిముండాకొడుకు లేమంటున్నారో తెలుసా! నువ్వు అభిమానం అమ్ము కుని బ్రతుకుతున్నావట.

శంక : ఎవరన్నది ఆ మాట? బుద్ధిలేకపోతేసరి

సింహా : ఇం కేపరు—నీ ప్రియశిష్యులు వెంకాయి, ఏసోబు...
రాత్రి దొడ్లో దాచిపెట్టిన కూలీలకాడికి చేరి నీమీద
ప్రచారం మొదలుపెట్టారయ్యా-ప్రచారం!

మహా : కనిపాక అక్కడను వెళ్ళబోసుకుంటున్నారు-మీరు
సహించగూడదండి!

సింహా : నేను సహిస్తానా కమ్చీ తీసుకుని బయలుదేరాను-
నాకు దొరికితే చెమడాలొలిచేవాణ్ణి.

శంక : వాళ్ళట్లా అనేవాళ్ళుకారే-మీరేమీ వాళ్ళమీద
చెయ్యిచేసుకోకండి-నేను మాట్లాడతాను.

సింహా : అటువంటి పిచ్చిపనులేం చెయ్యను...మంచినీళ్ళలో
మందుపెట్టే గకం.

శంక : అబ్బే! వాళ్లు న్యాయంచెబితే వింటారండి! చదువు
సంధ్యలు లేకపోవడంవల్ల కొంచెం మొరటుగా...

[ బయటనుంచి "శంకరం వచ్చారా" అని కేక ]

శంక : ఎవరూ? లోపలికిరండి!

మహా : ఓరి నీ సిగగొయ్యా! నువ్వికూడకూడా తయారయ్యావురా! ఏం నీ తాతసొమ్మేమన్నా దాచిపెట్టావా?

శంక : వెంకటేశ్వర్లు, ఏసోబు కదూ?

మహా : వచ్చారూ, తరిమెయ్యండి!

సింహా : ముందు పోతారా, పోరా! చెప్పుతీసుకుని కొడ
తాను-దొంగనాయాళ్లు! మెత్తగా చెబితే వినరు.
శంకరం లే, లేచి భోజనం చెయ్యి-పోదాం.

శంక : మీరు వెళ్ళండి-నేను వస్తున్నాను.

సింహా : ...అయితే ఇంతలో మూకనంతా గడికాక చెరు
స్తాను–నువ్వు వెంటనే రావాలిసుమా–ఈ కూలిముండా
కొడుకుల్ని చేరనిచ్చేవు ?

శంక : (లోపలికి వెడతాడు)

సింహా : (మహాంకాళిని ప్రక్కకుపిలిచి) రాశావా ?

మహా : (విసుగ్గా) ఆ, రాసినట్టేవుంది–రాసిరాసి నా తాడు
తెగుతున్నది–ఫలితమేముందయ్యా ఎంతరాసినా వీూకు
మెప్పులేదు.

సింహా : రాశావాలేదా చెప్పు ! ఇటువంటి ఫోర్జరీలు లక్ష
రాయించాను. మరి రాస్తానసెందుకు చెప్పావ్–ఇప్పుడు
వాటిని కలెక్టరుగారికివ్వాలికదా–దాని సైనుచ్చే
సరికి ముంచుతావా ?

మహా : ఇవిగో ! అన్నీ తయారుగా వున్నాయ్! వేలిముద్దర్లూ
కాలిముద్దర్లూ నాకు రాత్రంతా ఇదేపని.

సింహా : వాళ్ళెవరూ చూడలేదుగా ?

మహా : బొత్తిగానే !

సింహా ; నేను మరిచిపోలేనయ్యా.

మహా : అయితే నువ్వు మరిచిపోయ్యేదాకా ఆగాలన్నమాట.

సింహా : అయితే రా !

[ ఇద్దరూ వెళ్ళబోతున్నప్పుడు శంకరం వస్తాడు, వింటాడు, వంకరగా నిలబడిపోతాడు. ఆశ్చర్యం, సంధి గ్ధావస్థ దుఃఖం–హఠాత్తుగా సత్యమూర్తి ప్రవేశం. ]

సత్య : ఇదిగో మామా ! నీ కౌగితం.

శంక : నువ్విక్కడికెందుకొచ్చావ్? ఏంటా కాగితం? ఇటివ్వు!

సత్య : ఇవ్వడానికే తెచ్చాను...ఇది నీ పార్టీ వాళ్ళు రాసిందే. చదువుతా విను..."సదరు బ్రహ్మణ్యమ్మగారి మనిషైన సత్యమూర్తి అనే యువకుడు, మా బాధపుల్ని, స్నేహితుల్ని మర్డర్ చేస్తానని భయపెట్టి, సరియైన సాక్ష్యం ఇవ్వకుండా చేస్తున్నాడు. ఇతనినిగూడ తగిన కట్టుదిట్టాల్లో వుంచడానికి, కామందులవారు ఇతని మీద జామీను కేసుగాని, మరేవిధమైన చర్యగాని..." ఇది నీకు తెలియకుండానే పోలీసులకు పంపించారా?

శంక : నీ కెలా వచ్చిందా పిటీషను? ఇది అబద్ధం...అలాంటి పిటీషను నేనెప్పుడూ పంపలేదు.

సత్య : పంపావ్...నువ్వు చెప్పి రాయించావ్—ఇది ఎలా వచ్చిందో నేను చెప్పను. కాని ఇది వాళ్ళకు చేరలేదు. అసలు పోస్టులోనే పడలేదు.

కామే : (వచ్చి చూసి) నాయనా, మళ్ళీ వచ్చావా? ఈ మూడు నెల్లనుంచీ హాయిగా వున్నాం.

శంక : సత్యం! నువ్వు నా మీద ఊరంతా నోటకొచ్చినట్టు మాట్లాడుతుంటే విని ఊరుకున్నా...ఇక నేను... సహించను.

సత్య : ఏం పిటీషను పెడతావా?

శంక : ఆ పిటీషను విషయం నాకు తెలియదు. యదార్థం చెబుతున్నా—నీకు అపకారం చెయ్యవలసిన అవసరం నాకు లేదు.

సత్యా : ఇతగాలకు చెయ్యవలసిన అవసరం వుందేం!

శంక : నీకు తెలియదు – నీకు తెలియదురా సత్యం! ఈ సంసారం యీడ్చుకు రావలసినవాణ్ణి నేను—నేనూ ఏకాకిగా వుంటే నీమాదిరిగా ఎన్ని నీతులైనా చెప్ప గలను.

సత్యా : నామీద నీకు నమ్మకమున్నదా మామా ?

కామే : లేదు—

శంక : లేదు! నీ ప్రవర్తన నాకు ఎంత క్షోభ కలిగించింది!

[ సుందరి బయటకు రాబోతుంది. ]

కామే : నీకు కదూ చెప్పడం! లోపలికి పద.

శంక : నువ్వు వెళ్ళమ్మా!

[ కామేశ్వరి సుందరిని లోపలకు తీసుకుపోతుంది ]

సత్యా : ఇప్పుడే తేలిపోవాలి మామా! నేను బ్రహ్మయ్య పార్టీలో చేరుతున్నాను.

శంక : ధ్వంసం అయిపోతావు పో!

సత్యా : నన్ను తిట్టొద్దు—నాకు నీమీద కోపంలేదు మామా! పాపం నీ స్థితి చూస్తే నాకు జాలి వేస్తుంది.

[ సుందరి వచ్చి నిలబడుతుంది కామేశ్వరికూడా ]

శంక : (పెద్దగా) సత్యం!—బయటికి నడువు — నీమీద పగబడితే సహిస్తాను. కాని నీమీద దయదలచి మాట్లాడే వాడి మొహమైనా చూడలేను...

సత్యా : నామాట వినవా! ఈ దుర్మార్గులతో చేరి నీవు ప్రతిష్ఠలు పోగొట్టుకుని....

కామే : (సుందరిని లోపలను తీసుకుపోతూ) అబ్బాయ్! మా యింటికి నద్దాటే ఎందుకురా ?

[ సుందరి, కామేశ్వరి వెళ్ళిపోతారు. ]

సత్య : (పెద్దగా కేకవేస్తూ) సుందరీ! సుందరీ! నా నీతో మాట్లాడాలి. (సుందరి తల్లిని విదిలించుకుంటూ బయటికి వస్తుంది. సుందరితో) నే నింతకుముందే చెప్పాను! మీ తాత కేగతి పట్టిందో ఈయనకూ అదే తప్పదు — అనుకోని నేను బ్రహ్మయ్యతోనే వుండి మీ నాన్నను శిక్షిస్తాను!

శంక : నువ్వా? నిజంగా? మా నాన్నని నిలువునా ఖూనీ చేసిన బ్రహ్మయ్య పార్టీలో చేరుతున్నావా? పైగా నన్ను శిక్షిస్తానంటున్నావా?

సత్య : మామా! కోపంవద్దు! నిన్ను ప్రార్థిస్తా! నా మాట వినవూ! సింహాచలం స్నేహం వదిలిపెట్టవూ?

శంక : అది నీ కనవసరం!

మహా : బావ చెప్పేది నిజమే నాన్నా!

సత్య : సుందరీ! ఇంకెవరు చెప్పినా ప్రయోజనం లేదు! మీ అమ్మనూ నాన్ననూ ధనపిశాచం ఆవేశించింది! ఈ ఇంట్లో వుంటే ఇక మీ జీవితంకూడా అప్రతిష్ఠపాలౌతుంది.

కామే : (సుందరిని నెట్టుతూ) నువ్వు లోపలికి పొమ్మంటే ఎందు కిక్కడ?

సుం : (వెళ్ళదు. త్రోసివేసి నిలబడుతుంది)

సత్య : మామా! మీ దురాశ ఈ పసి జీవితాన్ని [illegible] ధ్వంసం చేస్తుంది.

కామే : ఏం పెళ్ళి చేస్తే నీ ఎదానపడి ఏడవాలా!

సుం : నాన్నా, నువ్వు మాత్రం...
సత్య : నాగ్దానం చెయ్యాలా? ఇప్పుడు కాదంటావా?
శంక : అప్పుడు చేశాను! ఇప్పుడు నాకు...
కామే : ఇష్టంలేదు!
శంక : ఇష్టంలేదు!
సత్య : అయినా మాకు భయంలేదు! సుందరి నేనూ జీవితాంతం కలిసి వుంటామని ప్రమాణం చేసుకున్నాం!
శంక : ప్రమాణం చేశావా?
కామే : వొట్టి మాటలు! అంతా కల్పన!
శంక : నువ్వు! మాతో అనకుండా! సత్యం! నువ్వు వెళ్లిపో-నువ్వు అవతలికి వెళ్లు! ఊ!
సత్య : సుందరీ! ఈ యింట్లో వుంటే ఈ గౌరవాలకు, కట్నాలకు లొంగి, నీ జీవితం బజారుకెక్కిస్తారు... ఇక నేనూ రాలేను. ఇక మనం కలుసుకోలేం! రా, వెళ్ళిపోదాం రా!
శంక : (గట్టిగా) సత్యం!
సత్య : సుందరీ! రా, మరి, రా, రావేం, మరిచిపోయావా? ప్రొద్దునేగా మాట్లాడిందీ! వస్తావా? రావా?
శంక : వాడితో రహస్యంగా మంతనాలాడుతున్నావా?
సత్య : వస్తావా? రావా?
సుం : బావా! వస్తా...
శంక : ఏమిటీ! (కోపంగా)
కామే : నువ్వు లోపలికిపోవే! పోవేం!
సుం (గట్టిగా) నేను పోను!

శంక : (అనునయంగా) అమ్మా! లోపలికిపో!

సత్య : ఆలోచించుకో సుందరీ! అన్ని విషయాలూ!

సుం : నాన్నా! (ఏడుస్తుంది)

కామే : (అనునయంగా) పోదాం పదవే! వాడికి పిచ్చెక్కి మాట్లాడుతున్నాడు!

సుం : ఉండమ్మా! ఉండవే! బావే!

శంక : ఎందుకేడుస్తావ్! ఈ మూర్ఖుడితో నీ కేందుకు! రాను పో!

సుం : (ఏడుస్తూ) లేదు, నాన్నా, పోను, పోను, బావా! బావా!

సత్య : నువ్వు రాలేవు! ఇప్పుడు రాలేవు! ఎప్పుడిష్టమైతే అప్పుడురా! నిన్ను సంతోషంతో ఆహ్వానించటానికి సిద్ధంగా వుంటా! ఎదురు చూస్తుంటా! (వెళ్ళిపోతాడు)

శంక : నాతో చెప్పు! ఎందుకు వాడిమీద అంత మమకారం? వాడు భ్రష్టుడైపోయాడు.

కామే : టైమ్ అవుతుంది... వెళ్ళకూ!

శంక : (దిగాలుగా చూస్తాడు)

కామే : భోజనం వడ్డిస్తాను–రండి!

శంక : సుందరీ! నామాట వినమ్మా! ఈ దరిద్రం ఈదుఃఖం నువ్వనుభవించలేవు... నేను సింహాచలంతో మాట్లాడతా... ఈ యేడాదే పెళ్ళి చేస్తాం–నువ్వు పచ్చగా వుంటే చాలు.

కామే : లేవండి మరి...

శంక : (సుందరితో) ఎందుకేడుస్తావ్ ?

సుం : ఏమీలేదు నాన్నా...ఊహు...ఏమీలేదు.

[ బయటనుంచి "ఏమండీం మాష్టరుగారూ !" అని పిలుస్తారు. ]

కామే : అదుగో — పిలుస్తున్నారు...మీరు భోజనం చెయ్యకపోతిరి.

శంక : (కండువా వేసుకుని, కాగితాలు పట్టుకుని) వస్తా. ఇక భోజనం లేదు, నిద్రలేదు, దుఃఖంలేదు, సుఖం లేదు. మనందరికి ఏదో పూనింది. ఏదో చీకటి తెర మనం కళ్లు కప్పింది. (వెళ్ళబోతాడు)

కామే : రా, అమ్మా, కొంచెం అన్నంతిని విశ్రాంతిగా పడుకో. వాడికోసమంత వెర్రేమిటే !

శంక : (ముఖానికి చేతులడ్డం పెట్టుకుని ఏడుస్తుంది.) అమ్మా ! అమ్మా !

కామే : ఏడుస్తావేమిటి ? వెళ్ళలేదని నాతో బొంకి...

సుం : (ఏడుస్తూ) అమ్మా ! అమ్మా !

కామే : ఏమిటమ్మా...నాతల్లిగా ! నాకు చెప్పు...ఎవరున్నారు? నాకు చెప్పు (సుందరి తలవద్దకు చెవిపెడుతుంది. సుందరి ఏదో చెప్పి పెద్దగా ఏడుస్తుంది. కామేశ్వరి నిర్ఘాంత పోతుంది) నిజంగా ! నిజమేనా ?

[ మహాంకాళి సంతోషంతో పొంగిపోతూ వస్తాడు. ]

మహా : అమ్మాయ్ ! మన పంట పండింది. విచారణలో మన వాళ్లే నెగ్గుతారమ్మాయ్...ఓ గుంపులుగా మూగారు.

[ కామేశ్వరి సుందరిని తీసుకొని లోపలికి పోతుంది. మహాంకాళి జేబులో డబ్బుతీసి లెక్కపెట్టి, నశ్యం వేసుకుంటాడు. కామేశ్వరి మళ్లీ వస్తుంది. ]

మహా : మనమెంత చెబితే అంత! కథ సస్టుగా నడుస్తోంది! (ఆమె విచారం కనిపెట్టి) ఏమిటి! ఏమిటి సంగతి? ఏం జరిగింది?

కామే: మన యింటికి చిచ్చుపెట్టారు మామా!

మహా : నాతో చెప్పమ్మాయ్... నే నున్నానుగా... చెప్పు...

కామే : ఆ పిల్లకు ఒంట్లో బాగాలేని కారణం...

మహా : కారణం?

కామే : (ముఖానికి చేతులు పెట్టుకుని ఏడుస్తూ) మా బ్రతు కింతవరకూ వచ్చింది... వాడు సత్యం!

మహా : దుర్మార్గుడు!

కామే ఎవరితోనూ అనవద్దు మామా!

మహా : ఎంత ద్రోహం చేశాడు.

కామే : ఆయనతో అనొద్దు...ఆయనతో అనొద్దు. నాపిల్ల... నా తల్లి...నా తల్లి కెంత ఘోరం జరిగింది!

[ తెర జారుతుంది. ]



# మహా పూ రు

## మూడవ రంగం

---

[రెండు నెలల తర్వాత: అదే ప్రదేశం రాత్రి 12 గంటలు. దీపం వుంటుంది. సుందరి కూర్చుని ఏదో చదువుకుంటుంది. శంకరం పచార్లు చేస్తుంటాడు. సుందరి భాగవతంలోనుంచి ఒకటి చదువుతుంది.]

శంక : నువ్వెళ్ళి పడుకో అమ్మా.

సుం : (చదువుకుంటూ మాట్లాడదు.)

శంక : అమ్మాయ్, వెళ్ళి పడుకో అమ్మా, పన్నెండు కావస్తున్నది......

సుం : నిద్ర రావడంలేదు నాన్నా !

శంక : ఎందుకిట్లా మేలుకుని ఆరోగ్యం చెడగొట్టుకోవడం! తర్వాత చదువుకోవచ్చులే...భాగవతమేనా ఇప్పుడు చదవవలసింది!

సుం : పూర్వం నువ్వు ప్రతిరోజూ చదువుకునేవాడివి కదూ నాన్నా...ఇప్పుడు మానేశావేం!

శంక : సరే, ఆ చదువులూ, సంధ్యలూ అప్పుడే పోయినై.

మహా : (బయటికి వచ్చి) ఏమబ్బాయ్! ఇంకా కబురు రాలేదే. బయట గాఢాంధకారంగా వుంది...అయినా నువ్విప్పుడొంటరిగా వెళ్ళడం మంచిదికాదోయ్.

శంక : ఇక ఆలస్యం చెయ్యడానికి వీల్లేదు...విచారణ జరిగి రెండు నెల్లయినా ఇంతవరకూ కేసు తేలకుండా...

మహా : అయితే కరణంపాత్రుడ్ని ఖూనీచెయ్యాలని ప్లాటేసిందనే మాట నిజమేనా అని ?

శంక : చెపుతాం...ఆ ప్లాటులూ పన్నాగాలూ రేపో మాపో తేలుతాయి.

మహా : ఇంతరాత్రికాడ వెళ్ళి ఆలోచించేదేమిటో ! ప్రొద్దున్నే మాట్లాడగూడదూ ! అంత గవాశ్యమా ?

శంక : ఔను...ఈ రాత్రికే మాట్లాడాలి. నేనూరుకున్నా సింహాచలం నిద్రపోడు.

మహా : ఎందుకైనామంచిది, నేనువెళ్ళి పిలుచుకొస్తా...నువ్విక్కడేవుండు...అమ్మాయ్...నేను వెళ్ళొస్తా...కర్రేదీ! ఆ...అందరినీ పిలుచుకురమ్మంటావా ?

శంక : వొద్దు...వొద్దు...సింహాచలం ఒక్కడే...ఇంకెవ్వరినీ వెంటబెట్టుకు రావద్దనిచెప్పు......(వెళ్ళిపోతుంటాడు) రెండో కంటికి తెలియకుండా రావాలి.

మహాం : తాతకు దగ్గులు నేర్పుతున్నావే !

కామే : (వస్తుంది) సుందరమ్మా ! పడుకోవే...అసలే చాల బలహీనంగా వుందండీ...పడుకోమంటే వినదు. మీరు నెలకు ముప్పయిరోజులూ పట్నంలోనే. ఇదేమో నే చెప్పినమాట వినకుండా దానిష్టమొచ్చినట్టు మాట్లాడుతుంది. నా మాట వినకపోబట్టే ఇంతవరకు వచ్చింది.

శంక : అమ్మమాట వినకపోతే ఎలాగే (కామేశ్వరితో) మన సుందరమ్మ పెళ్ళయితే అసలింటికి రానిస్తుందో లేదో... అసలు సింహాచలం రానిస్తాడూ, ఇప్పుడే మురుసుకుంటున్నాడు.

కామే : దొంగ ముండాకొడుకు ! వాళ్ళ మాటలతోనే జరుపు
తాడుగాని మంచిరోజు చూచి ఆమూడుముళ్ళూ వేస్తే!

శంక : కుర్రాడు బాగానే వుంటాడు...కొంచెం అహంకారం.

కామే : అంత పెద్దకుటుంబంతో వియ్యమందుకోవడం అదృష్టం కదండీ! మొన్న సిల్కులాల్చీ వేసుకుని, సిగరెట్టు కాలుస్తూ ఇటే వెడుతున్నాడు.

సుం : (నిలబడుతుంది) ఏడ్చాడు దొంగవెధవ!

శంక : ఏం ? మనసుందరమ్మ నీ రకమే వాళ్ళ పెంకిపట్టు...

కామే : నాకదే మండుకొస్తుంది' మీరకమే, అందుకే సత్యమంటే పడిచస్తుంది.

శంక : నాకీ సంగతి తొందరగానే తేలుతుందిలే...

కామే : ఊరినుంచి తరిమెయ్యకపోతే ఏరాత్రిపూటో ఇంటికి నిప్పుపెడతాడు... లేకపోతే వాడు ఈ యింట్లో ఎందుకుండాలి ?

శంక : పక్కలో బల్లెంమాదిరిగా...

సుం : అమ్మా! మీకింకేమీ పనిలేదూ.....ప్రొద్దునలేస్తే బావని ఆడిపొయ్యడమేనా ?

కామే : బావ! బావట! సిగ్గులేదూ!

సుం : ఎందుకూ! అంతసిగ్గులేనిపని నేనేంచేశాను! మీరు ఇక బావనంటే నే నూరుకోను.

కామే : ఏంచేస్తావ్! ఉరిపోసుకుంటావా ? పోసుకున్నా పీడ విరగడయ్యేది.

శంక : ఏమిటది ? ఏంమాటలు—ఊరుకో సుందరీ!

సుం: అమ్మను నామీాదంత కష్టంయకు! నేనంటేనే గిట్టదు!

కామే: నువ్వు చేసేపనులకు...(అలికిడి)

శంక: ఆగు! ఏదో అలికిడౌతున్నది... ఊరుకోండి ...ఆ... వస్తున్నారు. నువ్వెళ్ళమ్మా! లోపలికెళ్ళి పడుకో, పో!

సుం: నేను పోను నాన్నా...నాకు భయం!

శంక: మన యింట్లో మనకు భయమేమిటే! పో, పడుకో పో.

[ కామేశ్వరి సుందరిని పెట్టుకు లోపలకు తీసుకుపోతుంది. సింహాచలం, మహంకాళి లోపలకు ప్రవేశిస్తూ...... ]

సింహా: ఘాటింగు మీాయింట్లోనే పెట్టాలా? మా యింటికి రాకూడదూ? ఎందు కయ్యా అంత భయం!

శంక: నాకేంభయమండీ (నవ్వు తెచ్చుకుని) ఆ వాచ్చేదేదో అందరికీ వస్తుందిగాని...

సింహా: సరే, నువ్వు భయంతో వాణికిపోతున్నట్టు చెబుతుంటేనూ ఇతను...పులికడుపున మేకపుదుతుందయ్యా!

శంక: (నవ్వుతూ) నేను వాణికిపోతున్నానని చెప్పేవా?

మహా: అబ్బె! ఎందుకయినా మంచిది! మీారేరండి! అక్కడెవరూ ఉండరులే అన్నా...

సింహా: ఎవరెందుకులేరు! నువ్వు లేవూ? ఏమోయ్ నాకు అనుమానం జాస్తి. చెపుతున్నా! ఏదన్నా విషయం పొక్కిందాఅంటే నేను సామాన్యపు మనిషినిగాను. నీకేం భయమయ్యా ఇంటిచుట్టూ కాపలా పెట్టాను.

శంక: ఎక్కడ?

సింహా: మీా యింటిచుట్టూ...అంటే రాత్రిపూటలే, రోజులు బాగాలేవని...

శంక : ఏమో ?

సింహ : ఏమో... వాడు సత్యం ఇక్కడే కాపురం పెట్టాడుగా.

శంక : అంత ప్రమాదమేం వుండకు లెండి... మనం మాట్లాడ్దామా ?

సింహ : ఇక మాటల్తోను, పిటీషన్లతోను, జరగదయ్యా... ఎంతడబ్బు ఖర్చుపెట్టినా ఏట్లో పోసినట్లవుతుంది !

శంక : కేసు మనమీదికి తిరిగిన తర్వాత, ఇక మన పరువు ప్రతిష్ఠలు నిలుపుకోడానికైనా...

సింహ : మహాంకాళయ్యా, నువ్వు కాస్త లోపలికి పోవయ్యా. (వెళ్తాడు)

కామే : (బయటికివచ్చి) అన్నయ్యా ! కొంచెం పాలుపుచ్చుకుంటారా, రాత్రంతా మేలుకుంటారేమో !

సింహ : పసుగొత్తిపాలు తాగేకంటే నిలబడి నీళ్ళుతాగడం మంచిది. ఇదిగో పసుగెత్తుదామన్నాడు మనవాడు... పసుగెత్తాం...ఇక వెనక్కి పరిగెత్తాల్సిందే...

శంక : బలేవారే...ఇంకులో నేను చేసిందేముంది ! అందరిం సంప్రదించమని...

సింహ : నీదేగదయ్య సలహా ... అమ్మాయ్ నీ మాట తీసెయ్యమగాని, కొంచెం వేడిపాలు తీసుకురా...

కామే : అలాగే ! (వెళుతుంది.)

సింహ : ఈయన ఎదురుగ్గా ఉన్న విగ్రహంలాగ నిలబడితే ఏం మాట్లాడతాం ! పోవయ్యా, పడుకో పో... పెద్దవాడివి !

మహా : (శంకరంతో) నేనుంటే ఏంచేస్తానబ్బాయ్ !

శంక : ఏదో వెళ్ళమంటున్నారుగా...

మహా : నా కప్పుడే ఏం నిద్ర...మంత్రం చదువుకోవద్దూ...
(వచ్చి కూర్చోబోతాడు.)

సింహా : ఇదికూడా వుందీ, అయితే ఇప్పుడే పోయిచదువుకో, మళ్ళా మరచిపోతావు.

[ మహాంకాళి తప్పనిసరై లోపలికి పోతాడు. ]

సింహా : ఇక కానివ్వు...అతన్ని నమ్మగూడదు పంతులూ... కొంపలుముంచే రకం.

శంక : అవున్లెండి, పొరపాటున ఎక్కడన్నా అనేస్తే అనొచ్చు. ఇంతకూ...

సింహా : ఇదిగో, రోజురోజుకూ వ్యవహారం ముదిరిపోతున్నది. ఇప్పుడు మనం ఉపేక్షచేస్తే, రేపు మన గొంతుమీదికి కత్తివస్తుంది. విన్నావా ?

శంక : (ప్రశ్నార్థకంగా చూస్తాడు.)

సింహా : మీ మేనల్లుడు—ఆ సత్యం...ఇప్పుడు బ్రహ్మయ్యకు వాడు కుడిభుజం... నిన్న నేను వస్తుంటే ఏమంటు న్నాడో విన్నావా ?

శంక : (చిరాకుగా) ఏమంటున్నాడు !

సింహా : నిన్ను నేను దాసానుదాసుడికింద కట్టి, గానుగెద్దును తోలినట్టు తోలుతున్నానా ! అదేనా వాడనాల్సిన మాట...నీ అల్లుడైవుండి ?

శంక : వీడివల్ల ఏదో ప్రమాదం వస్తుంది.

సింహా : ఏమన్నాడు ! మామను మర్దరు చేయించడానికే ఈ సింహాచలంగాడు ఈ పనులన్నీ చేస్తున్నది...అన్నాడు.

శంక : చాటుచాటుగా మాట్లాడితే మనం లెక్కచెయ్యట్ల మెందుకండీ ?

సింహా : నీకు తెలియదయ్యా వాని ఆంతర్యం ! రేపో మాపో మనల్నిద్దర్నీ నడివీధిలో నిలేసి నవ్విస్తారు.

శంక : మనం ఊరుకుంటామా ఏమండీ...మనం అంత అభిమానం లేనివాళ్ళమా ?

సింహా : వాడు కరణం.....ఎంత దుర్మార్గమైనా చేయించగలడు. నిలువునా నడిరోడ్డుమీద నరికిపారెయ్యాలని, వాడనే దానిఅర్థం అదే.

శంక : వాడు బ్రతుకుతాడా ? అంతవరకూ వచ్చిననాడు మనమేనా చేతులు ముడుచుకొని కూచునేది !

సింహా : అదే వాళ్ళ ఉద్దేశం ! మన తడాఖా తెలియదు! ఎందుకులే పిచ్చిసన్నాసులు. ఏదో మతి సరిగ్గాలేక పార్టీలు కట్టారని దయతలిస్తే వాళ్ళు మరీ రేచుకుక్క మాదిరిగా ఎగబడుతుంటే...ఆరోజున నాకు చేసిన అవమానం నీకు చేసినట్టు గదూ !

శంక : అవును ! నాకు చాలా బాధవేసింది. అందులోనూ కలెక్టరుముందు! మర్యాద అనేది లేకపోయినతర్వాత.

సింహా : సరేనయ్యా...నా వంట్లో రక్తంలేదూ...నేను దేవాలయం డబ్బు తింటున్నానని, ఈ చెరువుకింద భూమి వస్తే గుడి కట్టించకుండా నేనే సాగుచేసుకుంటానని అంత నిర్మొహమాటంగా అన్నాడే...ఆ బ్రహ్మయ్యని నా ప్రాణముండగా వొదులుతానా ?

శంక : (నిలబడి) వాళ్ళ నీచత్వమే వాళ్ళను నాశనం చేస్తుంది. నిక్షేపంలాంటి లైబ్రరీని తగులబెట్టినవాళ్లు, ఇక కొట్లాటకు జంకుతారా!

సింహా : నువ్వు మాటమాటకూ లైబ్రరీ అంటావుగాని, ఒక లైబ్రరీ ఏమిటయ్యా, వాళ్ళ చరిత్రంతా అదేగా... ఒక వాములేమిటి, ఇళ్లేమిటి. పచ్చగావుంటే వోర్చుకుంటారయ్యా... మొన్న చూడరాదూ! బ్రహ్మయ్య వాళ్ళ పార్టీ వాళ్ళ వాములు తగులబెట్టించి నా మీదికి త్రోశాడు.

శంక : లైబ్రరీని వృద్ధిచేసి, స్కూలుమాష్టరు కప్పచెప్పి, నలుగురూ చదువుకునేట్టు చేద్దామనుకున్నా. కొత్తగా తెప్పించిన పుస్తకాలు కూడా బూడిదైపోయినయ్.

సింహా : సరేలేవయ్యా... నీ హయాంలో అసలు దాన్ని తెరవనే తెరవలా. అంతకంటే ముఖ్యమైన విషయాలు లేవూ? ఇప్పుడసలుకే మోసంవస్తుంది.

శంక : ఏం చెయ్యాలంటారు?

సింహా : వాళ్ళ ఆటలు కట్టించాలి. ఐసా పైసా తేలిపోవాలి. అందుకని నేను చెప్పేదేమంటే వాణ్ణీ, బ్రహ్మయ్యనీ... అసలు వాణ్ణి! ఎవరు...?

[ కామేశ్వరి వస్తుంది. పాలు ఇస్తుంది మాటలు మానతారు. ]

కామే : మామా! రా మామా, నువ్వొచ్చి కూచో.

సింహా : ఎందుకమ్మాయ్, నేను తర్వాత చెప్తా ... అతన్నట్లా వుండమను!

కామే : కాదులే అన్నయ్యా, ఈయనొట్టి అమాయకప్పు మనిషి. ఏదో ఒకటి జరిగిన తర్వాత విచారపడటంకంటే!

సింహా : నేను లేనూ... నా కాలోచన తెలియదూ...

కామే : మీకంటేనా...(నవ్వుతూ) మీరు ఇవాళ కోపంగా వున్నట్టున్నారు...మామగూడ వుంటే సలహా చెప్పు తాడు. చేసేది బాగా ఆలోచించి చెయ్యొచ్చు!

మహా : (వచ్చి కూర్చుంటూ) నన్ను వెలివేస్తారేం బావా? చెప్పగలిగితే చెపుతాను, లేకపోతే ముక్కుమూసు కుని మూల కూర్చుంటాను. దేవుడి సాక్షిగా చెప్పు తున్నా...మీ ఉప్పుతింటూ మీకు ద్రోహంచేస్తానా!

సింహా : (తనలోతను ఓదార్చు సంటూ) ఏమీలేదయ్యా... చీమ చిటుక్కుమంటే ప్రాణంమీదికివచ్చే రోజులివి.

మహా : అయ్యో! కాదుమరి! సరేగాని బావా, ఈ విషయం ఆలోచించండి! ఇప్పుడు సమాధానం చెప్పాలి! అమ్మాయి తొందరపడుతున్నది.

సింహా : ఏమిటది ?

మహా : ఇంతవరకూ ఆ సెట్టివ్యవహారం పైసల్ చెయ్యలేదు...

సింహా : చేద్దాం లేవయ్యా, పానకంలో పుడకలాగ...

కామే : అంత విసుగెందు కన్నయ్యా, మీరు వాగ్దానం చేసిం దేగా...

సింహా : నాకు విసుగా ? అది ఎంత తొందరగా పరిష్కార మయితే అంత నాకు సంతోష మమ్మాయ్.

కామే : తర్వాత చూసుకోవచ్చులెండి !

కామే : ఆయనకేం, అట్లాగే అంటాడు... చివరికి ఇల్లూ వాకిలి లేక బజారు కెక్కేదాక ఆయనంతే...

మహా : అప్పుడు తెచ్చిన డబ్బుకూడా నీవు స్వంతానికి అప్పు తీసుకుని...

సింహా : నువ్వుండవయ్యా! అమ్మాయ్! ఇప్పుడు మనపార్టీ పూరా ఖుష్బులోవుంది. ఈ కేసుమద్రాసు వెళ్ళక తప్పదు. అది తేలగానే ఇల్లు తాకట్టు విడిపించి, రెండెకరాల పొలంకొని పెట్టి...

కామే : అమ్మాయి సంగతి!

సింహా : ఓ తప్పకుండా... అది మనచేతిలోపని బ్రాహ్మడి చేతిలోపని.

కామే : వచ్చేనెలలో ముహూర్తాలున్నాయట.

శంక : చెయ్యడమో, చెయ్యకపోవడమో తేల్చండి. ఎన్నాళ్లీ వాయిదాలు? వాళ్ళిద్దరూ ఆశతో కృశించిపోతున్నారు.

సింహా : నీకే అంతపట్టుదలయితే మరి నాసంగతో... ముందు వెనుక ఆలోచించుకోవద్దు! మనందరి మర్యాదలు, గౌరవ ప్రతిష్ఠలు...

కామే : మాకేం మర్యాదలేదా, ఆస్తిలేదా? నాది 3 వేలు కట్నంక్రింద ఇస్తాను.

సింహా : డబ్బుదేముందయ్యా...మిగిలిన విషయాలన్నీ చూసుకుని జాతకమూ, హస్తరేఖలూ.....అబ్బాయిని మద్రాసు వెళ్ళిరానీ!

కామే : మళ్ళీ తర్వాత!

సింహా : ఏదీ ఈ గొడవేదో అంతు తేలితే......నేచెబుతాగా
అమ్మాయ్ !

కామే : సరే మీచిత్తం ! అమ్మాయ్ ! (లోపలికిపోతుంది)

శంక : (మహంకాళితో) అవతల పార్టీవాళ్ళు ఆయన్ను నన్నూ
పూర్తిచెయ్యాలని చూస్తున్నారు.

మహా : నాకు తెలుసు ! అందుకనే నేనుకూడ వినాలన్నది.
అయితే ఏమిటాలోచిస్తున్నారు ?

సింహా : ఇందుకోసం మూడువేలు తీసుంచాను. అమావాస్య
రాత్రిపూట అమ్మవారి తిరునాళ్ళకి గుడిదగ్గరే......
చూశావ్. ఆరుగురు...పేల్లెందుకులే ! (సత్యం మెల్లగా
కిటికీ తెరుస్తాడు ప్రక్కగా నిలబడుతాడు) బ్రహ్మయ్యనీ
వాడులేదూ, పుండాకోరు సత్యాన్ని సఫా చెయ్యాలి.

శంక : అంతమందిలోనా ? అందరికీ తెలిసిపోదూ ?

సింహా : (నవ్వి) ఒంటరిగా రహస్యంగా చేసేవి ఇంతకుముందు
చూశాం... అవే ఎక్కువ ప్రమాదం.

మహా : ఆలోచించాల్సిందే !

సింహా : పదిమందిచుట్టూ వున్నపుడే ఫలానావాడని చెప్పలేక

శంక : ఇంకోమార్గంలేదంటారా ?

సింహా : ఏమిటీ ! మళ్ళా మొదటికొచ్చిందీ కథ!

శంక : (మాట్లాడడు)

సింహా : నువ్వేమంటావయ్యా ?

మహా : ఓ ! నన్నడిగితే ఫస్టుగావుందంటా. అయితే ప్లానంతా
పూర్తిగా ఆలోచించనిదే ఇప్పుడేమంటాం లెండి ?

సింహా : ఈయనకెవడు చెప్తాడు... అడుగడుక్కా అనుమా
నాలే! ఈయనకు దేముడయినా నచ్చచెప్పలేడయ్యా.
శంక : ఇంతకంటె సౌమ్యంగా...
సింహా : పోవయ్యా... నిన్ను ఖూనీ చేస్తామని బహిరంగంగా
వాళ్లు ప్రకటనచేస్తుంటే నువ్వు సౌమ్యంగా, శాంతంగా.
మహా : ఆలోచించుకోనివ్వండి. ఒప్పుకుంటాడు... నీకుమాత్రం
ప్రమాదం లేదబ్బాయ్ ఇందులో.
సింహా : అసలు పూర్తిగా వినవయ్యా. ఊరికే తిరుణాళ్ళలోకి
పోయి నిలబెట్టి దెబ్బవేస్తాననుకున్నావా? అబ్బే
అట్లాఅయితే తెలివేముంది! ఒకరుపోతారు సూటీపోటీ
మాటంటారు. వాడూరుకోడు కదా ఇంకొకడు
పోతాడు. దెబ్బలాటదాకా వస్తుంది... మొదటివాళ్ళు
వెళ్ళిపోతారు ... చివరికి పోట్లాటపెద్దదై గుడినిండా
కేకలు, కర్రలు... అంతా మనవాళ్ళ నక్కడక్కడ నిల
బెడతాంగదయ్యా!
మహా : బాగుంది... ప్లాటంటే అట్లావుండాలి. ఇంకేంఅబ్బాయ్!
శంక : ఇది మంచిపనికాదు.
సింహా : పోనివ్వు మద్రాసునుంచి వచ్చినతర్వాత అక్కడ
విచారణ పూర్తిఅయిన తర్వాత ఈ భూమి మనకు
దక్కకపోతే, మనవాళ్లెవరికన్నా శిక్షలుపడితే...
శంక : అప్పటివరకూ ఆగుతామా ?
సింహా : నువ్వాగమంటే నాకేం ఇంకులోపట్టుదలలేదు.
మహా : ఎవరెవరు ?
శంక : ఇద్దరూ అవసరమా ?

సింహా : ఆహా...ఇద్దరూ... బ్రహ్మయ్య, సత్యం వాళ్ళిద్దరికి రాసుందయ్యా!

[ సుందరి ఏడుస్తూ బయటికి వస్తుంది.]

సుం : నాన్నా! నాన్నా! నువ్వు ఒప్పుకుంటున్నావా?

శంక : (కంగారు పడతాడు)

మహా : అమ్మాయ్! నువ్వు సముదాయించాలమ్మా! లోపలికి తీసుకెళ్ళు.

కామే : రా, లోపలికిరా...(తీసుకుపోతుంది)

సింహా : మాకోడలికి కష్టమేసిందే...చిన్నవాళ్ళని ఇవన్నీ విన నివ్వగూడదయ్యా ... నీకు రహస్యం తెలియదేం పంతులూ!

శంక : (తలపట్టుకొని) అవును, తెలియదు. ఇకఅయిపోయినట్టేనా?

సింహా : ఏమిటి? నీకు ముమ్మాటికి ఇష్టమేనా?

శంక : అలాగే...

సింహా : మనస్ఫూర్తిగాచెప్పు...ఊఁ...

శంక : అలాగేలెండి.

సింహా : ఆడినమాట తప్పడం మా పంతులు వంశంలోనేలేదు. వాళ్ళనాయనా, నేనూ దేహాలురెండుగానీ, ఆత్మ ఒక్కటే గదయ్యా! నాతో రా.

శంక : (తలఎత్తి దీనంగా చూస్తాడు. వాళ్ళిద్దరూ వెళ్ళిపోతారు కిటికీలోంచి సత్యం పిలుపు.)

సత్యం : మామా!

శంక : (నిర్విణ్ణుడై చూస్తాడు) సత్యం!

సుం : (పరిగెత్తుకొని వస్తుంది. కిటికీలోకి చూస్తుంది) బావా!

శంక : ఇంతసేపూ ఈ కిటికీ తెరిచేవుందా?

కామే : నేను గమనించ లేదు.

సుం : (వచ్చి) బావలేడు.

శంక : వీడికి మతిపోయింది.

కామే : విన్నాడేమో...

సత్యం : మామా!

శంక : తలుపు మూసెయ్...

కామే : వస్తున్నాడండీ!

శంక : (సత్యంలోపలికి వస్తాడు, శంకరం కర్రతీసుకొని ఎదురు వెళతాడు, సుందరి కర్రలాక్కుంటుంది.)

సత్యం : నమ్మిఇంట్లోకివస్తే కర్రతీసుకుని పైకొస్తున్నావా? కొట్టు!

సుం : ఊరుకో నాన్నా (సుందరి తండ్రిని కావిలించు కుంటుంది) బావని రానివ్వు.

కామే : అర్ధరాత్రిపూటెందుకొచ్చావ్? ముందుబయటికి వెళ్ళమనండి. నా కేదో భయంగావుంది.

శంక : ఇక్కడ నీకేం పనోయ్?

కామే : హాయిగా సుఖంగా వుంటె కన్నెర్రపుట్టి....

సత్యం : మీరు సుఖంగా వున్నారా! ఇక్కడ ఈ పిచ్చాసుపత్రిలో?

శంక : మాటలుసరిగ్గారానీ... (సుందరి అతనిదగ్గరకు వెళ్ళబోతుంది) సుందరీ ఇవతలికి రా ముందు.

సత్యం : పో అమ్మా...తల్లిచాటు బిడ్డవుపో!

కామే : ఎందుకొచ్చావిక్కడికి నా పిల్లనినాశనంచేసి... దాని మతిచెడిపోయి చూస్తూవూరుకుంటారేం ?

శంక : సత్యం ! నువ్వు వెళ్ళకపోతే ఇక నీ రక్తం కళ్ళచూస్తాను.

సత్యం : నువ్వా ! మద్రాసు వెళ్ళి రాకముందే ?

శంక : (నిష్క్రాంతపోతాడు)

సత్యం : వాళ్ళకంటె రక్తదాహం నీ కెక్కువైనట్టుందే... బాగుంది...అయితే నన్నూ, బ్రహ్మయ్యనూ స్వయంగానే చంపుతావా ?

శంక : ఏమిటది ? ఎవరన్నారు ?

సత్యం : విను ! ఏ మత్తా ! మీరంతా ఎప్పట్నుంచి హంతక వృత్తిలోచేరారు ? ఇదేం బడికివెళ్ళకుండా ఇంట్లో కూచుని అట్టెండన్సులు వెయ్యడం కాదు......ఇది ప్రాణంతో చెలగాటం.

శంక : నువ్విప్పుడు నన్ను చంపడానికొచ్చావా ?

కామే : దగ్గర కత్తివున్నట్టుందండీ !

శంక : పొడుస్తావా ? నేను నిరాయుధుణ్ణి ! రా ! నువ్వేహత్య చెయ్యి ! ఎవరోఒకరు చస్తేనేగాని మనకక్షలు తీరవు. రేపైనా నన్ను చంపేవాడివే...

సత్యం : నేనుగదూ ! అవును ! చంపుతాను ! అది చెప్పడానికే వచ్చాను. మీకంటె ముందుగానే మాపార్టీ నిశ్చయించింది. నువ్వుముందే హతమైపోతావ్. నువ్వు రేపు మద్రాసు బయలుదేరుతావా, బ్రతుకుతావ్ ! లేకపోతే ఎల్లుండి వుదయానికి నీశవంగూడా కనపడదు.

సుం : బావా ! బావా ! నీకుదయలేదూ...

[ మల్లీసుందరిని లోపలికి నెడుతుంది తల్లి ]

సత్యం : వుండబట్టే స్పష్టంగా చెబుతున్నా... ఈ రహస్యం సింహాచలానికి తెలుసు. అతను కావాలని మభ్యపెడుతున్నాడు. నిన్ను నీచంగా తనస్వప్రయోజనాలకోసం బలితీసుకుంటున్నాడు.

శంక : మా ఇంట్లోనిలబడి అతని మాట అనవద్దు.

సత్యం : నీ కళ్ళకు మైకంకమ్మింది...నీవు అమ్ముడుపోయావ్ !

కామే : ఛి ఛి! వాణ్ణి బైటికి నెట్టండి...

సత్యం : నేనే వెడతానత్తా...నిజం చెబితే మీకంత బెదురెందుకు...

శంక : నిజంచెప్పు నీ దగ్గిర కత్తిలేదూ ?

సత్యం : ఎంత పిచ్చివాడివి మామా ! పొడిచేవాడు ఇంట్లోకి వచ్చి పొడుస్తాడా...

[ వెనుకనుంచి మహంకాళి వస్తాడు ఇతన్ని చూస్తాడు
చేతిలోవున్న కర్రపైకెత్తుతాడు ]

శంక : ఆగు, ఆగు !

సత్యం : అవునురా, నా బ్రతుకేనీకు పాములాకన్పిస్తున్నది. ఎందుకాగమన్నావ్ ? నీ చేతులతోనే పుణ్యం కట్టుకుందామనా ?

శంక : లేదు ! నీవులోపలికెళ్ళు...నీవుగూడా. నీమీదనాకు పగలేదు. పరిస్థితులట్లా తోసుకొచ్చినై...నీవు శత్రుకూటమిలో చేరినమీాద కత్తికట్టావు. ఇక ఏఫలితం వచ్చినా ఇద్దరం అనుభవించకతప్పదు. పో, వెళ్ళిపో,

నిన్ను నేనుచూడలేను. లోపలికి వెళ్ళండి నా ప్రాణాని కేంభయంలేదు...ఊఁ!

సత్యం : మామా ! నీకెప్పుడు నిద్రపడ్తున్నదీ ?

శంక : ఏమిటా ప్రశ్న ?

సత్యం : నీకు మనశ్శాంతివుందీ? పూర్వంనీమనస్సు నిశ్చలంగా గంభీరంగా వుండేది? అంతదౌర్భాగ్యదశలోకూడ మంచి తనం నీసొమ్ము ... దుష్టులంతా నీ మంచితనంచూసి తొలిగిపొయ్యేవాళ్ళు, ఇప్పుడు నువ్వే వాళ్ళకు నాయకుడనయ్యావు.

శంక : శాంతగా మాట్లాడలేను పో...సత్యం పో, నన్ను ప్రశ్నించవద్దు.

సత్యం : నీమీదనాకుకార్పణ్యంలేదు, కాని నీపతనం నన్నూ సుందరినీ విడదీసింది.

కామే : ఆదౌర్భాగ్యుడితో ఇంకామాటలెందుకు ? రాత్రి పూట ఇంతదౌర్జన్యంగా ఇంట్లోకొస్తే...

శంక : అందుకు నేనుభాధ్యుణ్ణికాదు.

సత్యం : చూసుకో, నీఅరిచేతిలోరక్తం కన్పిస్తున్నది. అది దేహా లదికాదు. చిదికిన అంతరాత్మలది ఈ గ్రామాన్ని బాగుచేయడం మాని, భస్మంచేస్తున్న మీవంటి దుర్మార్గుల్ని సహించకూడదు.

శంక : ఎవరురా దుర్మార్గులు! రక్తస్పర్శవున్నదని ఇన్నాళ్ళూ నీ వెర్రి వేషాలనునిర్లక్ష్యంచేశాను. నువ్వేఅటులేకపోతే

ఈ కేసు గెలిచేవాళ్ళం, ఈ యాతనా తప్పేది...ఈ మాటలు, ఈ ఖూనీలు లేకుండా...

సత్య : అను! అను! నువ్వేన్నన్నా పడతాను! వాటన్నిటికీ నీవేనాటికైనా పశ్చాత్తాపపడక తప్పదు!

శంక : పశ్చాత్తాపంతో నీకు కృతజ్ఞత చూపుతాననుకున్నావా! నేను తలవంచి ఎవరికీ ఈ జన్మలో కృతజ్ఞత చూపను! ఏ ముఖంతో ఆమాట అంటావురా! పో! ఇంకా నిలబడతావేం (కర్ర తీసుకుని వెంటబడతాడు. సత్యం వెళ్ళిపోతూ)

సత్య : రేపు మద్రాసు వెళ్ళు...జ్ఞాపకం వుంచుకో రేపే బయలుదేరు... లేకపోతే...

శంక : (ఒక్కడేవచ్చి ఇంటిమధ్య నిలబతాడు, అతని నేత్రాలు భగ్గున మండుతున్నాయి. అతని చేతులు వొణుకుతున్నాయి. పిచ్చిపట్టిన వాడిలాగ తిరుగుతున్నాడు. హఠాత్తుగా లోపలినుంచి)

సుం : (ఏడుపు కేకలు విన్పిస్తాయి) వొద్దు! అమ్మా! వొద్దు. నీకు దణ్ణం పెడతానే! నన్ను బ్రతకనివ్వు! బావా! బావా! నాన్నా! ఎక్కడున్నావు నాన్నా! వదులమ్మా నన్ను! వొదలవే! నాకొద్దు! నాకొద్దు! (ఆమె సరాసరి వచ్చి తండ్రి కాళ్ళమీద పడుతుంది ఏడుస్తూ) "నాకు మందు పెడ్తున్నారు నాన్నా! నన్ను బ్రతికించు నాన్నా! నాన్నా! నేను బ్రతకను."

కామే : (వస్తుంది)

శంక : (తలెత్తి ప్రశ్నార్థకంగా కామేశ్వరివైపు చూస్తాడు)

కామే: (చేతులో గ్లాసు వుంటుంది. రెండు కాగితపు పొట్లా లుంటాయి. సుందరిని గమనుతూ) బుద్ధిలేదూ! పైగా ఆయన కాళ్ళమీద పడితే ఆయనేం చేస్తారు !

శంక : ఏమిటే! ఏం జరిగింది.

కామే: చూడు నీ బావ నీ ప్రాణం సిలువునా తియ్యటానికి తయారైనాడు...నీ ఇష్టంవచ్చినట్టు ప్రవర్తించి మా వంశాని కపకీర్తి తెస్తావా ? ఇంతకంటె చావరాదూ.! (ఆమె చేతులు పట్టుకొని పైకెత్తబోతుంది)

శంక : ఉండు ! ఉండు!...లే సుందరీ!....ఏమిటి? నిజమేనా?

కామే: అడగండి ! ఊరంతా పొక్కిపోయింది...ఇక మీకు కూడా తెలిస్తే నష్టమేముంది !

శంక : (సుం॥ని) నిజమేనా ? చెప్పమ్మా, నిజమైతే మాత్రం నేనేం చేస్తాను... నిజమేనా ?

సుం : (ఏడుస్తుంది అతని గుండెమీద తల వాలుస్తుంది)

శంక : (కామేశ్వరితో) ఇన్నాళ్ళూ నాకెందుకు చెప్పలేదూ?

కామే : ఎప్పుడు చెబితే ఏం ప్రయోజనం ! దానికి బాగా చనువిచ్చి నెత్తికెక్కించు కున్నందుకు అనుభవించండి!

శంక : (గట్టిగా, ఎందుకు చెప్పలేదూ! (మహాంకాళి ప్రవేశం) నీకుకూడా తెలుసు కదూ?

మహా : ఏంచేస్తా మబ్బాయి ! అసలే గంపెడు కష్టాలతో నువ్వు ...

శంక : మీ అనుమానాలు కట్టిపెట్టండి ! ఇన్నాళ్ళూ నన్ను మభ్యపెట్టి మీ ఇష్టమొచ్చినట్లు ప్రవర్తిస్తున్నారా ? నా కళ్ళకు గంతలుకట్టి గోతిలో తొయ్యాలను

కున్నారా మీరు, మీ కేకారణం! దీనంతటికీ మీ కే కారణం (సుం॥ని దూరంగా నిలబెట్టి) సుందరీ! నువ్వెళ్ళిపో—ఊ

కామే : అదేమిటి?

శం : అమ్మాయ్! సుందరీ! వెళ్ళిపోమ్మా! నన్ను క్షమించమ్మా! ఇక నీకూ మాకూ సంబంధం లేదు, వెళ్లు! నీ దుస్థితికి కారణం నేనే—నన్ను క్షమించు. పో, వెళ్ళిపో. తప్పంతా నాది తల్లీ! నాది! నువ్వేం చేస్తావు!

కామే : అవేం మాటలు, అది వెళ్ళటమేమిటి...ఎక్కడికి ఈ అర్ధరాత్రివేళ...

మహా : నలుగురికీ తెలుస్తుంది...

శంక : ఇప్పుడు తెలియదూ... పెండ్లి సంగతి నిశ్చయించమంటే సింహాచలం ఎగతాళిగా మాట్లాడాడు...నా గుండెలో గుచ్చుకొన్నది...అప్పుడు అర్ధమవుతుంది. ఇంకా ఎన్ని మహాన్యాగ్రాలు ఈ యింటినిండా దాగున్నాయో...వెళ్ళు సుందరీ...నీ భర్త దగ్గరికిపో... ఈ వరకు నిన్ను కూడా బలితీసుకుంటుంది! పో!

కామే : వద్దండీ! వద్దు వద్దు. అదేంచేస్తేయ్యేం? మనబిడ్డ మన కడుపులో బెట్టి కాచుకోవాలి వాడూరుకోడు. రానివ్వడు...

శంక : లేకపోతే...ఏ నూతిలోనో గోతిలోనో పడి చస్తుంది. చస్తే ఆ పాపం మనది...అపరాధులం మనం.

సుం : నాన్నా! నాన్నా!

శంక : తప్పదు...నువ్వెళ్లాలి...(తను బయలుదేరి వాకిలి వరకూ వీపున చెయ్యిబెట్టి పంపిస్తాడు) వెళ్ళమ్మా! ఎవరి జీవితానికి కెవరు బాధ్యులు! వెళ్ళు.

[సుందరి బైటికి వెళ్ళి మళ్ళీ లోపలికి పరుగెత్తుకొని వచ్చి తండ్రికి తల్లికి నమస్కరిస్తుంది ... ]

కామే : అమ్మాయ్ (భోరున ఏడుస్తుంది) నా పిచ్చితల్లి ప్రాణం!

శంక : ఇది నీకు మరుపురాదు...ఇది నా గుండెలో శూలం గుచ్చింది. నీ అమాయకత్వాన్ని నేను మరిచి పోలేను...(సుం–శంక–దగ్గరకు రాబోతే) నీ ముఖం నాకు చూపించకు.

సుం : నాన్నా! దయుంచు నాన్నా! అమ్మా! నాన్నా:

శంక : దయకాదమ్మ ఎర్రని ఇనుపకడ్డీలతో ఈ కళ్లు రెండూ పొడిచెయ్ తల్లి! నువ్వు శిక్షించు తల్లి! ఇది నాతప్పా నీ దురదృష్టం! నీ పాపం!

కామే : (వచ్చి శం–చేతులు పట్టుకుంటుంది) నేను బ్రతకలేను రానివ్వండి...దాన్ని రానివ్వండి!

శంక : (నిశ్చయంతో) నువ్వు తీసుకుపోయి వీధి గుమ్మంలో వదిలిపెట్టిరా! తలుపు గడియ వెయ్యి!—ఇది నీకు నాకూ శిక్ష...నువ్వు దానికి తల్లివికావు, నేను తండ్రిని కాను...ఈ పల్లెలో కుళ్ళంతా మనింట్లోకి వరదగా కొట్టుకొచ్చింది–నన్నూ నిన్నూ అందరినీ ముంచేసింది, హత్య చేసింది. అది పసిపిల్ల గనక బయట పడింది.

మన అంతరాత్మలు ఎప్పుడో నాశనమైపోయినయి. కామేశ్వరీ మనం చనిపోయాం...

కామే : మీరు వెర్రిగా మాట్లాడుతున్నారు. ఒద్దు! మీరు మాట్లాడొద్దు!

శంక : నేను స్వయంగా ఇన్ని దుర్మార్గాల కొడిగట్టగలనా! నేను చనిపోయాను...నీ అంతరాత్మ చనిపోయింది! రేపు రాత్రికే మద్రాసు...

కామే : అవును! వెళ్ళండి...కొంచెం విశ్రాంతిగా తిరగండి. ఈ సంగతులెవరితోనూ చెప్పొద్దు...

శంక : చెప్పను! చెప్తితే నన్ను బ్రతకనివ్వరు...కాని, ఏం చేస్తానో 'కేసు ఏమాతుంతో నేను చెప్పలేను! నేను చేసిన ఈ మహాపరాధానికి ఏ శిక్ష సరిపోతుంది!

కామే : ఊరుకోండి! ఊరుకోండి...ప్రక్క వేసొస్తాను పడు కుందురుగాని (లోనికి వెళ్తుంది. బయట ఏదో అలికిడి అవుతుంది. శంకరం అటూ ఇటూ చూస్తాడు) ఎవరు! ఎవరక్కడ ?

[ వెంకటేశ్వర్లు త్వరగా పరుగెత్తుకుని లోపలకు వస్తాడు ]

వెంక : నమస్కారం బాబూ! మీరు నిద్రపోవడంలా ?

శంక : ఇదేమిటి ? ఇప్పుడొచ్చావేమిటి ? ఎట్లా వచ్చావ్ ?

వెంక : క్షమించండి. బయట రౌడీలు కన్పిస్తే నాతల పగిలేదే బాబు! అప్పుడే మావాళ్ళిద్దరు చనిపోయారు.

శంక : ఎప్పుడు ? ఆస్పత్రిలోనా ?

వెంక : అందుకే వచ్చాను బాబు ! ఆసుపత్రిలోవున్న నలుగురిలో ఇద్దరివాళ పొద్దుగూకే తలిక్కి ప్రాణం విడిచారు, సింహాచలం పుణ్యమా అని ఇంకోడు కొనవూపిరిలో ఉండాడు ! మీరిప్పటికైనా మనస్సు మార్చుకోరూ ?

శంక : చనిపోయారా ? నాకు తెలియదే ! చనిపోయారు ! అవును ! సింహాచలం పుణ్యం కట్టుకొన్నాడు... బ్రహ్మయ్య పుణ్యం కట్టుకున్నాడు.

వెంక : ఇప్పుడు శవాలనుగూడా ఇవ్వమంటున్నారు బాబు! మావాళ్ళంతా ఆసుపత్రికడ పడిగాపులుగాస్తూ ఏడుస్తున్నారండి !

శంక : అవును ! ఏడుస్తారు ! అవును ! ఈ పార్టీ కక్షలఫలితంగా మీరేడుస్తారు...

వెంక : మాకు పొలం రాకపోగా ఇన్నికష్టాలొచ్చి... మీరు పూనుకోకపోతే ఇంకా వస్తై...ఈ లోకం.

శంక : ఇంకావస్తయి. ఈ లోకం అమాయకుల కొరకు కాదోయి. హంతకులకు !

వెంక : మీవంటివారు కూడా వాళ్ళకు లోబడి, వాళ్ళకే మద్దతుచేస్తే......

శంక : అవును ! చేస్తున్నాను ! చేశాను...ఇక చెయ్యవద్దంటావా ?

వెంక : అదే బాబూ ! అదే ! అదే ! మీరు మాకు అండగా నిలుస్తేచాలు, పొలం వచ్చినా పోయినా మీరు సహాయంచేస్తే అదే పదివేలు !

శంక : వెళ్లు! పో! వెళ్లు! నాదగ్గిరకెవ్వరూ రావద్దు!

వెంక : మమ్మల్ని కాపాడరూ?

శంక : ప్రొద్దున్నే డాక్టరుకు ఉత్తరం రాసిస్తా...పో...మీ వాళ్లు మద్రాసొస్తారా? పో...డాక్టరుకు ఉత్తరం రాసిస్తా...పో (వెం-వెళ్ళిపోతాడు) ప్రాణాలుపోతే పోయినై శవాలేంచేసినై? ఇంకా ఎన్ని ప్రాణాలు తీస్తారు! ఎన్ని! ఎన్ని!

[ తెర జారుతుంది. ]

# మహా ప్రూ రు

## నాలుగవ రంగం

---

[ మూడు నెలల తర్వాత, అదే ప్రదేశం ; మధ్యాహ్నం 12 గంటలకు ]

సింహా : (ప్రవేసిస్తాడు. చేతిలో పూలదండ, తాంబూలం వేసుకుని వుంటాడు. అతని ఆనందానికి మితిలేదు) అమ్మాయ్ ! కామేశ్వరమ్మా ! చెల్లీ !

మహా : (బైటికి వస్తాడు) రండి, రండి, ఇదిగో ఇక్కడ కూర్చోండి ! మీకేమైనా కబురందిందేమో వచ్చి అడుగుదాం అనుకుంటున్నాం... వెళ్ళి మూడు నెలలైనా ఇంతవరకూ జాడా జవాబూ లేదు.

సింహా : తొందరెందుకయ్యా... చేసేదేదో పగడ్ బంద్ గా చేస్తున్నాడు... రాత్రి పేటను వచ్చారంట...

మహా : వచ్చారా ! ఏమైందో !

సింహా : ఏమయిందని అడుగుతావ్ ! మన శంకరం మెడ్రాస్ వెళ్ళడమూ పని పూర్తికాకపోనటమూనా ! గెలవకపోతే ఇన్నాళ్ళెందుకు పడుతుంది...

మహా : పత్రికల్లో ఏమన్నా పడిందేమో ! టెలిగ్రాం వస్తుందంటివే ?

సింహా : అసలు నాయకుడే వస్తుంటే టెలిగ్రాము లెందుకు ? అమ్మాయ్ గారెలు, పులిహోర, పరమాన్నం చెయ్యి-

ఆ మద్రాసు హోటల్లో తిని తిండికి ముఖం వాచుం టాడు...

మహా : ఏమో అక్కడేమాతుందో అని అమ్మాయి దిగులు పడి కూచుంది !

సింహా : అట్టాగా ! నే చెబుతున్నా విను ! మనం గెలిచితీరు తామయ్యా! ఒంటెగంట కావస్తున్నది. కానియ్యమ్మా ఎండన పడొస్తాడు...అన్నట్టు సుందరమ్మ ఏదీ ?

మహా : మీకు తెలిసే వుంటుంది...

సింహా : (నాలుక కొరుకుక్కుంటూ) నేను వేరే ధ్యాసలో వుండి అడిగాను...ఏంచేస్తాం ! అనుకుంటాంగాని ఖర్మ కెవరు బాధ్యులయ్యా.

మహా : వాడు మోసంచేశాడు.

సింహా : అసలితను గట్టిగా నిలబడలేదయ్యా...లేకపోతే (రహస్యంగా) వాళ్ళిద్దర్నీ మర్రిచెట్టుకు వేలాడదీసే వాణ్ణి...ఎంత మూర్ఖం కాకపోతే...పక్క యింట్లో ఆ అమ్మాయితో కాపురం పెడతాడా ! ఇప్పుడు వాళ్ళు ఏం ఊకుతున్నారో విన్నావా ?

మహా : కేసు సంగతా ?

సింహా . విన్నాన్ ! పిచ్చిసన్నాసులు...అసలు వాళ్లు గెలవ డానికి చాన్సు ఏదీ అంటా...జిల్లా కోర్టులో మసాక వేస్తే మాత్రం హైకోర్టులో పెద్ద పెద్ద జడ్జీలముందు వీళ్ళ తెలువు లాగుతయ్యా...

మహా : అవును వూళ్లో అనుకుంటున్నారు.

సింహా : ఊరంతా నోరు పెట్టి అరుచుకుంటే గెలుస్తారయ్యా.

మహా : నేనూ నమ్మాను... అందుకనే...

సింహా : మతిలేనివాళ్ళని నమ్మాల్సిందే... మనకు అనవాతీ అయ్యా, జిల్లా కోర్టులో ఓడిపోవటం, హైకోర్టులో గెలవడం, రేపు ప్రొద్దుటికల్లా చేనంతా దున్నించి పైరు నాటకపోతే నా పేరు సింహాచలంకాదు.

కామే : (వస్తుంది) మనం పోతరాజు గుడి కట్టిస్తామని... నాకు మొక్కుబడికూడా వుంది.

సింహా : గుడి ! ఏంగుడి ! డబ్బేం కోళ్లేరుకు తింటన్నయ్యా అమ్మాయ్... ఇంతవరకు పదివేలు పోశాం... ఈచంద్ర హారం కొత్తగా చేయించుకున్నావా? బాగుంది.

మహా : సుందరమ్మ దక్కితే ముడుపు లిస్తానని మొక్కుకున్నది.

సింహా : బలేపనిచేశావ్ ! గుడి కట్టించకముందే మొక్కుబళ్లు మొదలుపెట్టారా ? ఏదో రెండేళ్లు సాగుబడిచేసి ఫల సాయంవస్తే...

కామే : ఆ సెట్టితో ఇంతవరకు ఫైసల్ చెయ్యలేదన్నయ్యా !

మహా : మనం గెలిచినట్టేకదా !

సింహా : చూద్దామయ్యా చూద్దాం...నాకుమాత్రం తొందర లేదు...జడ్జిమెంటు చేతికిరానీ.

కామే : చాలాకాలమైపోయింది_బోలెడు వడ్డీ పెరుగుతున్నది.

సింహా : పెరగనియ్యమ్మా ! నేను లేనూ ! నువ్వేం ఆదుర్దా పడకు.

మహా : ఆరోజున మీరు అప్పుగా పుచ్చుకున్న...

సింహా : అప్పు ? ఏమప్పు? ఎవరిదగ్గర ?

కామే : అదే అన్నయ్యా !

సింహా : ఏదీ, నాకు జ్ఞాపకంలేదే...ఎప్పుడు ?

కామే : ఆ రోజున, ఆయనవద్దంటే రెండువేలూ నా చేతిలో పెట్టి...

మహా : అప్పుగా తీసుకుంటున్నానని నువ్వేగదయ్యా చెప్పింది.

సింహా : ఓ, అదా ! అదేం పెద్దమొత్తం ! తిరగనియ్యమ్మాయ్ నువ్వు వూళ్లో బదుల్లిచ్చిన రెండువేలూ, నీ దగ్గర రెండువేలూ, ఈ యిల్లు తాకట్టు వదిలించిన తర్వాత చూద్దాం.

కామే : మీరు సహాయంగా వుంటే...

మహా : మీరే ఈ దీపం నిలబెట్టినట్టు !

సింహా : అదేమిటమ్మాయ్ ! ఇదిగో పూలదండ తెచ్చా... శంకరం మా నాయకుడు. అతనేది చెయ్యమంటే చెయ్యటమే మా వంతు.

మహా : మనవాడికోసం తెచ్చారా ?

సింహా : సన్మానమయ్యా...తెల్లారుఝామున జీతగాణ్ణి తరిమి కోయించా—ఇది మీ వదిన స్వయంగా కట్టింది !

[బయట ఏదో అలికిడి వినిపిస్తుంది]

కామే : మీరు ఆయన్ని తోబుట్టువు మాదిరిగా చూసుకుంటున్నారు. (బయట అలికిడవుతుంది సింహాచలం అదుర్దాగా చూస్తాడు)

మహా : ఆ ! ఏంలేదులెండి పిల్లలు చెడుగుడు ఆడుకుంటున్నారు.

సింహా: వస్తున్నా! (లేచి పూలదండ జాగ్రతగా ఒకపక్క పెట్టి వెళ్ళిపోతూ) దీన్ని ముట్టుకునేవమ్మోయ్ వడిలి పోతుంది! (వెడతాడు)

మహా : ఈయనకు నేనేం అపకారం చేశానమ్మోయ్!

కామే : వచ్చినంతవరకు గుంజుతుంటివి.

మహా : ఏం ఈయనేమిచ్చాడేం! (బయటకి భయంగా చూస్తూ) మొత్తం వెయ్యి దాటలా! అంతకంటే కరణం నయం!

కామే : కరణం దగ్గర నువ్వుకూడా డబ్బు తీసుకున్నావా?

మహా : తీసుకోకపోతే వూరుకోనని పట్టుబడితే ఏం చెయ్యమంటావు!

కామే : ఇందులో నీ స్వంత వ్యాపారంగూడానా?

మహా : వచ్చి రెండు చేతులూ పట్టుకుంటే ఎట్లా తప్పుతుందమ్మోయ్! మనవాడేం చేసొచ్చాడో! నువ్వు గట్టిగా చెప్పావో లేదో.

కామే : అన్నం తింటున్నప్పుడు మెల్లగా ఈ సంగతెత్తితే మండిపడ్డారుగానీ...

మహా . అది సహజమే—అయితే ఊరుకున్నావా!

కామే: లేదుమామా. నువ్వు చూస్తావుగా ... అయితే బ్రహ్మయ్య కవుతుంది. లేకపోతే వాయిదాపడుతుంది. కరణంగారే తప్పకుండా గెలుస్తారు—పాపం వాళ్లు మూడు వేలిచ్చినప్పుడు వాళ్ళకి న్యాయంగా సహాయం చెయ్యొద్దూ...సింహాచలంగారు.

సింహా: (లోపలికొస్తూ) ఏమమ్మోయ్! ఇది కొత్తవింత!

మాలాళ్ళంతా వూరుమీాదికి బయలుదేరి టముకు వాయిస్తున్నారు...(పెద్దగా నవ్వుతూ) భూమి వాళ్ళ కొచ్చిందని...వొస్తుంది...వొస్తుంది ... బండిసున్నా వొస్తుంది !

మహా : వెర్రి వెధవలు

సింహా : (బైటికి చూస్తూ) అమ్మాయ్ ! అమ్మాయ్ ! వస్తు న్నాడు ! వంటయిందా ?

మహా : వచ్చాడా! అమ్మాయ్! త్వరగారా...నేను పొద్దున్నే పంచాంగం చూశాను. ఇప్పుడు వర్జంలేదు.

సింహా అమ్మాయ్ ! రా చెల్లీ ! గడపదగ్గర నిలబడు ! దృష్టి తీసెయ్ ! అదేమిటి ! ఆ మాలకుంకలంతా వెంటబడ్డా రేం ! ఏదో అఘాయిత్యం చెయ్యరుగద !

[ కామేశ్వరి చేతిలో ఏదో పట్టుకుని దృష్టి తీసెయ్యడానికి బయటకు వెళుతుంది. బయట కోలాహలం వినిపిస్తుంది ]

మహా : (కుర్చీలు బల్లలు సర్దుతుంటాడు)

సింహా: ఎవర్రా అక్కడ ! ఏమిట్రా ఆ కేకలు ! నేనొచ్చా నంటే ఒళ్ళు వలిచేస్తాను! (సంతోషంతో) రా, శంకరం లోపలికిరా.

మహా : (పూలదండ చేతిలో పట్టుకుంటాడు) ఇప్పుడే వేద్దామా

సింహా: ఏమయ్యోయ్ ఆదండిటివ్వు మొనగాడివే.

[ శంకరం లోపలికి వస్తాడు. సిహాచలం దండ వేస్తాడు. శంకరం వదనంలో నవ్వులేదు. విశ్చలంగావుంది. సిం. కౌగలించుకోబోతాడు. అతను దూరంగా తొలుగుతాడు. మహాంకాళి అతని చేతిలో సూటుకేసు తీసుకుంటాడు. కండువా తొలగిస్తాడు]

మహా : ఏమయింది ?
సింహా: వుండవయ్యా, కూచోనియ్యి ! ఏమౌతుంది !
కామే : (నిలబడి, ఫలితం ఏమయిందా అని ఎదురు చూస్తు న్నది)
[ శంకరం సింహాచలం రెండు భుజాలూ పట్టుకొని కుర్చీలో కూచోబెట్టబోతాడు అతను కూచోడు ]
మహా : శంకరం, ఏమయిందబ్బాయ్ ?
సింహా: అబ్బె ఏమౌతుందయ్యా మనం గెలిచాం. జడ్జిమెంటు ఇప్పుడే చదివి చెపుతావా లేకపోతే...
శంక : (నవ్వుతాడు)
సింహా: (నవ్వుతూ) పండేనా ?
శంక : మాలపల్లె గెలిచింది. (నిశ్చయంగా నెమ్మదిగా)
మహా : ఏమిటబ్బాయ్ !
సింహా: ఆఁ !
శంక : మనం గెలవలేదు, కరణం గెలవలేదు—మాలపల్లె గెలిచింది.
సింహా: ఏమిటోయ్ ! నిజంగా ! ఏమిటి ?
శంక : మీరూ, బ్రహ్మయ్య ఓడిపోయారు...పల్లెలో కూలీలకు...
మహా : కూలీలు, ఏం కూలీలు ? అసలేంజరిగింది ? ఇదెట్లా తెల్లెందుకున్నావ్ ?
[ కామేశ్వరి లోపలికి వెళ్లిపోతుంది ]
మహా : చెబుతాడు వినండి ఏంజరిగిందో ముందువిని...
సింహా: ఏంజరిగింది ! మరోవిధంగా ఎట్లా జరుగుతుందయ్యా రెండువేలు మూటగట్టి పంపితే...అక్కడవాళ్ళను

డబ్బు మప్పులా! నిన్ను పంపిందిదేనికి... పెద్ద పేరు మోసిన లాయర్లను పెట్టిందిదేనికి? వాళ్ళను కట్టుకోలా?

శంక : మీరు నన్ను కట్టుకోలేదు!

సింహా : (నిర్ఘాంత పోతాడు) ఏమిటి! ఇప్పుడు నువ్వన్న దేమిటి?

మహా : (సింహాచలం చేతులు పట్టుకుని కూచోపెడతాడు, వదిలించుకొని)

సింహా : వుండవయ్యా!—నువ్వు...అంటే నువ్వే...

శంక : అవును! నేనే ఎదురు తిరిగాను...

సింహా : (అటూ ఇటూ పచార్లు చేస్తూ తిరుగుతాడు) అలాగా! ఓహో! అలాగా!

శంక : ఈ రెండు పార్టీలు మన వూరిని నాశనం చేశాయని దూరంనుంచి చూసిగాని గ్రహించలేకపోయాను.

సింహా : ఓరి ద్రోహీ! (మహాం. సింహా. దగ్గరకొచ్చి బ్రతిమ లాడుతాడు)

మహా : ఏదో పొరపాటు జరిగింది. వాడు మతి చెడిపోయి మాట్లాడుతున్నాడు. మెల్లగా విచారించి...

సిం : చాల్లేవయ్యా బయలుదేరావ్! పాముని పాలుపోసి పెంచి...

శంక : ఎవరు పాము?

సిం : నువ్వు! నువ్వు! సిగ్గులేదూ! నా డబ్బంతా నాశనం చేసి, నా పరువంతా గంగలో కలిపి, ఇంకా నోరెత్తి మాట్లాడుతున్నావ్!

శంక : అవును ! మాట్లాడుతున్నాను ! మాట్లాడతాను ! మీకూ ఆ భూమికి సంబంధం లేదు...కరణం పార్టీకి దానికీ అసలే సంబంధం లేదు. పల్లెలోవున్న బీదా బిక్కీ- చారెడు భూమి కావాలని, నీరులేని చెరువులో నేల సాగుచేసుకుంటామంటే మీ కడుపుమండి...

సిం : ఓహో ! ఇంతవర కొచ్చిందీ...

మహా : ఉండండి, మీరూరుకోండి.

శంక : మీరు హాయిగా ఇంట్లో కూచుని వాళ్ళచేత మీ కక్షలన్నీ తీర్చుకుంటే వాళ్లుగదూ ఎముకలు విరిగి ఆసుపత్రిలో పడి అనుభవిస్తున్నది. ఇద్దరు చనిపోయారు ! ఆ శవాలనైనా దక్కకుండా మీరే పూడ్చిపెట్టారు.

సిం : (మహంకాళితో) చూశావయ్యా...ఇంతకంటె నమ్మకద్రోహి వుంటాడా...నోట్లో నాలికలేనివాణ్ణి తెచ్చి - నాయకుణ్ణి చేశాం...మా వుప్పుతిని...

శంక : మీ వుప్పు నేను తినలేదు...బీదల నోళ్లుకొట్టి బ్రతికే నీవంటి భూస్వాములు, చెట్టుక్రింద ప్లీడర్ల మాటలువిని మోసపోయాను. ఈవూరి జీవితాన్ని మీ గుప్పెట్లో పెట్టి రక్తం పిండుతున్నారు.

సిం : నిన్నెవరొప్పుకోమన్నారోయి....బడిపంతులికి పనికి రానివాణ్ణి... మేనేజరుచేసి, ప్రెసిడెంటుచేసి...జొన్న కూటికి గతిలేనివాణ్ణి, బస్తాలకొద్దీ నా స్వంతగాదెలో బియ్యం కొలిపించి, బాకీలు తీర్చినందుకు ఇదా నీ కృతజ్ఞత ! అసలు నిన్నిందులో ఎవరు కలుగజేసుకోమన్నారోయి !

శంక : అవును... మీరు నాకు నిష్ప్రయోజనమైన పదవులు కొన్ని కట్టిపెట్టారు. దారిద్ర్యంలో, దుఃఖంలో గత్యంతరం కన్పించక మీ ఆశలతో కళ్లు మైకం కమ్మి ఒగ్గాను.

సింహా : అయితే ఇన్నాళ్ళనుంచి మన్నుల్ని మోసంచేసి చివరికి సిలువునా ముంచుతావా ?

మహా : ఊరుకోండి. పెద్దవారు మీరుకూడా కోపగిస్తే వాడికి నిలువనీడ వుంటుందా !

సిం : అంతా విని అట్లా అంటావేమయ్యా... పీనుగు వాళ్ళతో షరీకై నన్ను ముంచితే...

మహా : రామ రామ అతనెప్పుడూ అలా చెయ్యడు.

[ వెంకటేశ్వర్లు, యేసోబు వస్తారు సంతోషంతో ]

వెంక : మీ మేలు మరచిపోం...

సింహా : మీరెందుకొచ్చార్రా ఇక్కడికి_అతనితో మీకేంపని!

వెంక : ఆయన మావాడు___మా తరఫున వాదించి గెలిపించాడు.

యేసో : ఆయన న్యాయాన్ని బట్టి పోతాడుగాని మీసాలు చూసి మోసపోడండి !

సింహా : ఏమిటీ ! మీకు కొమ్ములొచ్చినై రా... పూట పూటకీ గింజలు కొలుస్తుంటే మెక్కి కొవ్వెక్కి...

శంక : వాళ్ళకేం కొమ్ములు రాలేదు.

వెంక : కొమ్ములు విరగ్గొడుతున్నాం.

సింహా : ఎంత పొగరెక్కి మాట్లాడుతున్నార్రా ! మీకుకదూ

లోలోపల గోతులుతవ్వి అతని మనస్సు మార్చి కన పడకుండా ద్రోహంచేసింది—మీ పని పట్టిస్తాను...

వెంక : మేమే, ఆయన మనస్సు మార్చలేదండి!

శంక : మీరు నాయింటిచుట్టూ కాపలా పెట్టి పరాయి వాడితో సంబంధం పెట్టుకోడానికే తీరిక లేకుండా నా జీవితాన్ని, సంసారాన్ని బంధించి...

వెంక : బందెలదొడ్డిలోకి తోలినట్టు, నిర్దాక్షిణ్యంగా...

శంక : నా మనస్సు క్షోభపెడితే అప్పుడు వాళ్ళు నాకు నిజం బోధించారు! మీ కొట్లాటవల్ల వాళ్ళలో ఇద్దరు చనిపోయారు. గంపెడాశపెట్టుకుని కష్టపడి అర్ధరు వేయించుకున్న బంజరు వాళ్ళ ఇన్నాళ్ళకూగాని దక్కలేదు.

సింహా : ఏమిటీ! వాళ్ళపేర అర్ధరు పడిందా! అరె! అరె! మా భూమి!

వెంక : అది మీదికాదు, మాది. ఈ ప్రపంచంలో చారెడు నేలలేక అలమటించే మా వంటివాళ్లు తలకొక ఎకరం సంపాయించుకుంటే మీకెందుకంత కడుపుమంట?

యేసో : కన్నెర్ర?

సింహా : (కోపంగా) ఉండు! రేపటినుంచీ మీరు వూళ్లో బావులదగ్గర అడుగుపెట్టారంటే శిరస్సు లెగిరిపోతై - ఈ మాలసజ్జునంతా గొర్రెల గుంపుక్రింద తెగేస్తాను. పై వూళ్ళనుంచీ చాకళ్ళనూ మంగళ్ళనూ పిలిపిస్తా చూసుకోండి ఏంచేస్తానో...ఏమయ్యా దమ్ములుంటే

చూసుకుండాంరా, నా కాగితాలు యావత్తు బయట పడెయ్... ఇదిగో పదినిముషాల్లో వస్తున్నా.

సహా : (సింహాచలంకు ఒంగని బైటికి పోతాడు)

వెంక : మీ కేం పర్వాలేదుబాబు! మేమున్నాం! ప్రాణానికి ప్రాణం ఇస్తాం!

యేసో : ఇదుగో పంతులుగారూ! నేసి వాళ్లో ఎన్నో ఖూనీలు చూసినా... నాకు సీమకుట్టినట్టే నాలేదు. కాని ఈ యేళ నా రక్తం ఉడుకుతుండాది. మీ కేంమకు మీరు భద్రంగా వుండండి! మా గొంతులో వూపిరుండగా మిమ్మల్నెవరూ తాకడానికి వీల్లేదు.

కామే : (వచ్చి దిగులుగా) మీరు వెళ్ళండి! వెంకటేశ్వర్లూ తర్వాత మాట్లాడొచ్చు. భోజనం చెయ్యండి చల్లారి పోతుంది (వెంకటేశ్వర్లు, యేసోబు వెళ్ళిపోతారు)

వెంక : (నవ్వి) భోజనం! బాగా జ్ఞాపకంచేశావ్, అవును తిండికోసమేగా ఈ తిప్పలన్నీ. నీ వంటిభార్య వుండటం నా అదృష్టం!

కామే : నేనేం చేశాను! మీ అందరికంటే నేనేం తెలివిగలదాన్నా?

వెంక : ఆశగలదానివి...అందుకు చూడు, నీ పిల్లకు సుఖంగా వివాహ మహోత్సవం జరిగింది. నీవూ నేనూ? అంత స్థలమేడ కట్టుకుని...

కామే : ఆ మాలకుంపు మిమ్మల్ని మాయ చేసింది.

వెంక : నన్నా!... అయితే నే నెప్పుడూ ఎవరో ఒకరి మాయలో పడిపోవలసిందేనా!

[ బ్రహ్మయ్య, సత్యం ప్రవేశిస్తారు. ఎగతాళిచేసి ఏడిపించడం సత్యం ఉద్దేశం. పగబూని సాధించడం బ్రహ్మయ్య కోరిక ]

సత్య : నమస్కారం మామగారూ !

బ్ర : నమస్కారం పంతులుగారూ !

శంక : (ఆశ్చర్యంగా చూస్తాడు. కామేశ్వరి చరచర లోపలికి పోతుంది) నన్ను మామా అని పిలవద్దు.

సత్య : క్షమించండి ! క్షమించండి ! నే నల్లుడిగా వుండటానికి అనర్హుడ్నయినప్పటికీ...

శంక : నాకు నమస్కరించనక్కర్లేదు—పంపనిమీద వచ్చారండీ !

[ ఇద్దరూ కూర్చుంటారు ]

బ్ర : మద్రాసునుంచి వచ్చారని, సంగతులు తెలుసుకొని...

సత్య : (పూలదండ చేత్తో తీసుకుని చూస్తూ) మరచి పోయ్యాను మామా ! నేనుకూడా ఒక పూలమాల వేద్దామనుకున్నాను...

శంక : క్షేమంగానే తిరిగొచ్చాను...ఎక్కడా ఏ ప్రమాదం జరుగలేదు చాలునా ?

బ్ర : మీకేం, మద్రాసు సిటీ మీకెరుగనిది గనకనా ? మహంకాళి ఎక్కడున్నాడు ?

శంక : లేడు, బయటకెళ్ళాడు...ఏంకావాలో నాతో చెప్పండి ! త్వరగా...

బ్ర : అబ్బే, పంపని లేదు ! అలా చికాకుగా వున్నారేం ?

సత్య : సింహాచలంతో పోట్లాడాడు...

శంక : నువ్వెవరవురా... ఎన్నిసార్లు చెప్పినా నిర్లజ్జగానే యింట్లోకొచ్చి...

సత్యం : ఇది నీ యిల్లుగాదు నెట్టేసి...

శంక : నోర్ముయ్!

బ్ర : (లేచి) ఏమిటయ్యా మహా దబాయిస్తావు! అభిమానం లేకపోతేసరి...

శంక : నా అభిమానానికేం లోటులేదు. నా కర్మమయ్యింది. మీరు కయ్యానికి కాలుదువ్వి కసితీర్చుకోవాలని చూస్తున్నారు. (సాహంకారి వస్తాడు చూస్తాడు. చర చర లోపలికి వెడతాడు) ఇటురండి! మీతో పనుందట

బ్ర : అతనితో కాదు. నీతోనే పని! నిన్ను సంజాయిషీ అడగటానికి వచ్చాం.

శంక : సంజాయిషీ-నన్ను? మీరడుగుతారా?

బ్ర : అవును. ఈ కేసులో మమ్మల్ని మోసం చేశావా?

శంక : (ఆశ్చర్యంతో) మిమ్మల్నా? మీకేం వెర్రా?

సత్యం : మాక్కాదు వెర్రి...

శంక : ఎందుకీ చిత్రహింస. నన్ను హత్య చెయ్యదలచుకుంటే రండి, సిద్ధంగా వున్నాను. ఒక సదావినుంచీ, నేను పార్టీలో చేరినప్పట్నుంచీ సుడిగుండంలోపడి గిల గిలా కొట్టుకుంటున్నాను! అంత పగవుంటే చంపు రా!

బ్ర : ఓహో! ఇట్లా తిరిగావ్! అయితే చెప్తా విను! (సత్యం వారించబోతాడు) సత్యం! నువ్వు కాస్సేపు ఊరుకోవాలి... ఇది మా పార్టీ వ్యవహారాలు డబ్బుతో నడిపిన పని.

సత్య : నేను మీ తరఫున రాలేదు. ఆ సంగతి నీకు ముందే చెప్పాను.

బ్ర : అయితే, అట్లావుండుమరి...నీవు మాకు ఒప్పందం చేశావా లేదా? కలెక్టరు విచారణ దగ్గర్నుంచి, హైకోర్టు తీర్పుదాకా మా తరఫున రహస్యంగా...

శంక : నే నొప్పందం చేశానా! నేను!

బ్ర : మహాంకాళి ద్వారా...నీ భార్యతో స్వయంగా మాట్లాడాను...

శంక : (ఉగ్రుడై) కామేశ్వరీ! ఇటురండి! అతన్ని బయటికి రమ్మను ముందు (వాళ్ళిద్దరూ రారు) నే నెప్పుడూ ఈ నీచానికి ఒడిగట్టలేదు.

సత్య : సింహాచలంతో చేతులు కలపడం నీచంకాదూ?

బ్ర : నువ్వొకటి చేసి ఒకటి చెయ్యలేదనుకుంటున్నావా—ముందు ఆ డబ్బంతా అక్కడ పెట్టు...మధ్య దళారులను పెట్టి వీలయినంతవరకూ పిండొచ్చుననుకున్నావేం? జిల్లాబోర్డులో గెలిచినపుడు నీ ప్రజ్ఞే అనుకున్నాం—ఏ ఎండకాగొడుగు పట్టే నీ వంటి...

శంక : నిజం చెపుతున్నాను...నీ పార్టీతో నాకేం సంబంధం లేదు. నాళ్ళకుతప్ప నీకు నేనెప్పుడూ సహాయం చెయ్యలేదు. చెయ్యను, నీవు నా శత్రువువి...ఇప్పుడు నాకెవరూ శత్రువులు లేరు.

సత్య : నేను తప్ప!

శంక : అవును!

సత్య : నీకు నీవే శత్రువువి... నేను కాదు. నీ అమాయకత్వమే నీకు శత్రువు.

శంక : ఒకరి దగ్గర ఎతులు నేర్చుకు నేటంత మందబుద్ధిని కాను ఆలోచన వుంది, అనుభవం వుంది.

సత్య : ఇప్పుడు...

శంక : ఇప్పుడు మీరు వెళ్ళొచ్చు!

బ్ర : ఏమిటయ్యా సత్యం మీ వాదాలు, నేను వచ్చినపని కానివయ్యా .. మేం వెళ్ళడానికేం రాలేదు. మమ్మల్ని నమ్మించి ద్రోహంచేసి వెళ్ళమంటున్నావా ? నీ వల్లనే మేం ఓడిపోయాం ! లేకపోతే తగిన ఏర్పాట్లు ముందే చేసుకునే వాళ్ళం. నిన్ను నిలువునా నరికినా పాపంలేదు నీ అల్లుడొకడు నా వెంటబడబట్టి బ్రతికిపోయాను గాని లేకపోతే ముందే హతమయ్యేవాడివి. రమ్మను ! పిలువ్ ! కావాలంటే రుజువుంది. ఆ డబ్బి వ్వమను.

శంక : ఇదంతా నిజమే ! కామేశ్వరి ! ఇటురండి ! వస్తారా నన్నొచ్చి బయటకీడ్చుకు రమ్మంటారా ? రండి ముందు ! (ఇద్దరూ వస్తారు)

సత్య : ఓహో, మహంకాళి మహాశయా ! క్షేమమా !

శంక : మీ రతనిదగ్గర డబ్బు తీసుకున్నారా ? ఏమయ్యా ?

మహా : ఏమో నాకు జ్ఞాపకంలేదు...

బ్ర : ఇదిగో. ఈ చేవ్రుత్తరం నువ్వు రాసిందే...జ్ఞాపకం వొచ్చిందా ?

శంక : నా సంతకం పెట్టావా ?

సత్య : ఎవరి సంతకమైనా పెడ్తాడు.

బ్ర . (వెనకనించి) ఈయనలాగే...

కామే : ఇప్పుడు అవసరమై తెప్పించాం...

శంక : నువ్వు చెప్పు...లోపూచీగా మాట్లాడించి నువ్వేనా?

బ్ర : అతని తరపున

మహా : అవును!

శంక : నీకు తెలుసా ?

కామే : (తలూపుతుంది)

శంక : ఎంత తీసుకున్నారు ? (బ్రహ్మయ్యతో)

బ్ర : రెండు వేలు...

శంక : అంతేనా (కామేశ్వరితో)

కామే : (తలూపుతుంది)

శంక : డబ్బెక్కడ పెట్టారు... తెచ్చి యివ్వండి !

కామే : లేదండీ !

శంక : ఏంచేశారు ? (మహంకాళితో)

[ మహంకాళి మాట్లాడడు ]

సత్య : మహంకాళి మింగేశాడు.

కామే : ఆ ఊళ్లో పొలం తాకట్టు వుందని తీసుకున్నాడు...

శంక : ఇతనా ? అహాఁ !

మహా : నే తెచ్చిస్తాలేవయ్యా (బ్రహ్మయ్యతో)

బ్ర : ఇదేం చెలగాటమా ? ఇప్పుడు కావాలి...

శంక : ఇప్పుడింటో డబ్బేమైనా వుందా ?

కామే : (లేదని తలూపుతుంది)

శంక : లేదూ ?

మహా : లేదు !

శంక : అయితే నీ మెళ్ళో చంద్రహారం ఇవ్వు (అతనే తీసిస్తాడు)

సత్య : కరణంగారూ! అవి మీరు తీసుకోడానికి వీల్లేదు! ఇవ్వొద్దు మామా! అక్కర్లేదు, మహంకాళి చేసిన మోసానికి మీరెందుకు బాధపడాలి?

శంక : (సొమ్ములిచ్చి) ఈ గాజులుకూడా ఇవ్వు — సరిపోయిందా ?

బ్రహ్మ: బలేవాడి వేలే...ఊరుకో—నీదేం పోయింది...?

సత్య : నీది పోయిందా ? పార్టీలు నడిపి దయా-దాక్షిణ్యాం లేకుండా ఎదురుతిరిగితే ఖూనీలు చేయించడం, లొంగివస్తే మెళ్లో సొమ్ములతోసహా ఒలుచుకోవడం...

బ్రహ్మ: చాల్లేవయ్యా పెద్దమనిషీ! నీవు మాతో వుండటం వల్లే చివరికిట్లా పరిణమించింది. (వెళ్ళబోతాడు)

శంక : వెళుతున్నారేం ?

సత్య : వచ్చినపని అయిందింతవరకు-రాబట్టుకున్నాడుగా...

బ్రహ్మ: వెళ్ళక నీ యింటిముందు తపస్సు చెయ్యమంటావా ?

శంక : మళ్ళీ వస్తారా ?

బ్రహ్మ: అవసరమైతే (వెళ్ళబోతాడు)

శంక : వస్తే గడపదాటి వెళ్ళవు. జాగ్రత్త! పో !!

బ్రహ్మ: (లోపలికి వచ్చి) అలాగా! నువ్వు వీధిలోకి అడుగు పెట్టవయ్యా తెలుస్తుంది. మాలపల్లె అంతా నీ తరఫున వస్తానని విడిసి పడుతున్నావేమో! వాళ్లొక్క పురుగు కూడా ఊరుగవిడి తొక్కకుండా బంద్ చేశాం...నువ్వు

వాళ్లకూడ మాడిగన్సారా లేదా చూడు. (వెళ్ళి పోతాడు)

సత్య : మామా! నువ్వు జాగ్రత్తగా వుండాలి...ఇదంతా నీ చలవే మహాంకాళీ!

[ వెళ్లిపోతాడు ]

మహా : కుర్రకుంక!

శంక : (నవ్వుతూ) మనం పెద్దవాళ్ళమై వెలిగించే దేమిటి? (మహా॥ లోపలకు వెళ్లి పోతాడు) రండి! నిలబడండి! లోప లేముందీ! వంటగది వుంది! ఆ వంటగదిని పోషించ డముకోసం మీరూ, నేనూ అంతా వెర్రి తాపత్రయం పడుతున్నాం...మన మంచితనం, మన ధర్మబుద్ధి, పొయిలో కట్టెలుగా మండించి, తిండి తింటున్నాం.

కామె : నేనిలా అవుతుందనుకో లేదు_నాదే పొరపాటు.

మహా : (చేతులు నలుపు కుంటాడు)

శంక : నీ మీాద నాకు కోపంలేదు...ఎంత మంచిదానివైనా 20 ఏళ్ళు దారిద్ర్యంలో కుంగిపోయి, దిక్కుతోచక పోతే, కుతంత్రాలు నేర్చుకున్నావ్! అతను మనకు గురువు! నేనూ నీవు శిష్యులం!

మహా : అబ్బాయ్! నాకు చాలా పశ్చాత్తాపంగా వుంది... నే నేదిచేసినా మీారు బాగుపడి, పెద్దవాళ్లై పరువు ప్రతిష్ఠలతో...

శంక : ప్రతిష్ట, ప్రతిష్ట! ఆ మాట నా ముందనొద్దు...అబ్బ ఎంత పతనమైపోయినాసరే నాకీ బూటకపు ప్రతిష్ట వొద్దు...అస్థిపంజరాలమీాద నిలబడి పైకి వచ్చామను

కునే మనం, స్వచ్ఛమైన జీవితం ఎలా వుంటుందో ఊహించుకోగలమా ?

కామే : ఎవరో వస్తున్నారు ! ఇంకేం జరగాలో ?

శంక : రానివ్వవమ్మా రానివ్వు ... ఇది సంసారంకాదు, సుడిగుండం... ఇందులో పడిన తర్వాత వుక్కిరి బిక్కిరి అయిపోవడమేగాని ఊపిరి పీల్చుకోలేం... రానీ...

మహా : సింహాచలం ! నువ్వు లోపలికి పదమ్మా !!

శంక : మళ్ళీ వచ్చావా ! నువ్వుగూడా లోపలికిపో (కామేశ్వరి వెడుతుంది) నువ్విక్కడేం అక్కర్లేదు ! (మహాంకాళి వెడతాడు)

సింహా : (వచ్చి కఠినంగా) ఏవీ ఆ కట్టలన్నీ ఇటివ్వు...

శంక : (పెట్టితీసి ఇస్తూ) ఇదిగో, నీ కేసు పుట్టుపూర్వోత్తరాలన్నీ ఇందులో వున్నై (అతని ముఖం చూడకుండానే అందించుతాడు)

సింహా : (క్రూరంగా) ఇటుచూడు! ఆ కాగితా లెక్కడున్నై- ఆ ఫోర్జరీలు ?

శంక : ఏవి ? మాలవాళ్ళ వేలిముద్రల్తో మీరు తయారు చేయించినవా ?

సింహా : అవి ఇందులో వున్నయా లేవా ?

శంక : లేవు !

సింహా : వాళ్ళకిచ్చారా ? నీదగ్గర లేవూ ?

శంక : ఇదిగో ! ఇవ్వను. వీటితో వాళ్ళ గొంతుకలను ప్రతి వేస్తారా ? వాళ్ళ నోటికివచ్చిన కూడు తీసేస్తారా ?

సింహా : ఇస్తావా, ఇవ్వవా ?

శంక : ఇవ్వను (చించేస్తాడు)

సింహా : (వెర్రెత్తి కాలితో నేలమీద అదిమికొట్టి) ఇంత కళ్లు బలిసిందేం ? రేపీసాటికి నీ యిల్లూ నువ్వూ నేలకుట్ట వస్తారు (పెట్టి తీసుకుని వెళ్ళిపోతాడు. అతను వెళ్ళ బోయేముందు భార్య వస్తుంది నిలబడి చూస్తుంది)

[ శంకరం చెయ్యి పట్టుకుంటుంది ]

కామే : రండి ! ఇది మంచిరోజు కాదు ! వచ్చి పడుకోండి !

శంక : ఇది చాలా మంచిరోజు కామేశ్వరీ ! అందరూ నిజ స్వరూపాలతో నాటక మాడుతున్నారు.

కామే : ఏమిటా చూపులు ! లోపలికి రండి. కొంచెంసేపు నిద్రపోండి !

శంక : దూరానికి చూస్తున్నాను... కాలంలోకి.

కామే : అన్ని రోజులు ఇలాగే వుండవు. రండి మరి !

శంక : అవును ! వుండవు !

[ తెర జారుతుంది. ]

# మహాప్రస్థానం

## నాలుగవ రంగం

---

[ అదే ప్రదేశం—నాలుగవ రంగం జరిగిననాటి రాత్రి—12 గంటలు
శంకరం, కామేశ్వరి రహస్యంగా ఊరు విడిచి వెళ్ళడానికి సిద్ధపడు
తున్నారు. ఊరికి వెళ్ళడానికి సిద్ధంగా కట్టలుకట్టి వున్న సామాన్లు
కొన్ని కనిపిస్తాయి. ]

శంక : ఇంక ఎంతసేపు ఈ సర్దడం?

కామే: ఎక్కడండీ! బోలెడు సామానులు. అన్నిటికీ నేనొక్క
దాన్ని. హఠాత్తుగా బయలుదేరకపోతే...

శంక : బండికోసం కబురుపంపిన తర్వాతగూడ నీ గొను
గుడు తగ్గలా? తప్పదు, ఇప్పుడే బయలుదేరాలి.

కామే : అర్ధరాత్రి...త్రోవలో పురుగూ పుట్రా...

శంక : కామేశ్వరీ! నీ డబ్బు ఆశతో నా ప్రాణం తీసేస్తావ్!
నీవు ఎప్పుడో వడ్డీకిచ్చిన డబ్బంతా ఇప్పుడు వసూ
లౌతుందా? ఇక అది పోయినట్లే...ముందు సామా
నులు మూటకట్టు...

కామే : డబ్బుకోసం కాదండీ...

శంక : ఇక నాతో వాదించి ప్రయోజనం లేదు...ప్రొద్దున
ఆ పోట్లాట జరిగినప్పుడే చెప్పాను...మహంకాళి
ఇంకా రాలేదే!

కామే : క్రోసెడు దూరం నడిస్తేగాని బండి దొరకదు...ఈపాటికి వస్తూండాల్సింది.

శంక : నిజంచెప్పు ! అతన్నింకెక్కడికీ పంపలేదు గదూ ?

కామే : ప్రమాణంగా లేదండీ ! మీ కాపదవస్తే నాకొచ్చినట్టు కాదూ? ఇటువంటి సమయంలో డబ్బుకోసం పంపుతానా ?

శంక : డబ్బుకాదు, దాని కోసం, సుందరికి కబురుచెప్పడం కోసం...నిజంచెప్పు...దానివిషయం మరిచిపొమ్మని ఎప్పుడో హెచ్చరించాను.

కామే : లేదండి! మీరు చెప్పిన తర్వాత ఆ ఉద్దేశమే మానుకున్నాను. దానికేమీ చెప్పి పంపలా.

శంక : కన్నప్రేమ వదులుకోలేవు కామేశ్వరీ! నాకుమాత్రం బిడ్డకాదూ? ఇట్లా గహాస్యంగా వెళ్ళిపోతున్నామని కబురంపితే అది వాడికే చెబుతుంది. వాడు ఊళ్లో వాళ్ళను పోగుచేసి మన ఇంటిమీదికి తోలుతాడు.

కామే : అంతమాత్రం నాకు తెలియదూ?

శంక : ఇప్పుడు సింహాచలం, బ్రహ్మయ్య ఒక తల్లిబిడ్డల్లాగా వాలక పోసుకుంటూన్నారు !

కామే : దుర్మార్గులు! ఈ పీడ వదిపోలితుందిలెండి (బయటికి చూసి) సుహంకాళి మూటమోస్తున్నాడు...నడిచే వస్తున్నాడే!

శంక : బండి దొరికిందో లేదో...మనచావో బ్రతుకో ఈ రాత్రే తేలిపోతుంది.

కామే : మావల్ల మీకెన్ని కష్టాలొచ్చినయ్యో! (ముఖం కప్పుకుంటుంది) ఇకనెప్పుడూ మీ మాట కాదనను.

శంక : పిచ్చిదానా! ఇది విచారించవలసిన సమయంకాదు. రేపు తెల్లవారితే పేటలో వుంటాం...లిస్నా తిసక పోయినా...పగబట్టి ఇళ్లు తగలబెట్టే నీచులెవరూ వుండరు. నీకు భయం వద్దు...నీక్గా నేనే మిగిలాం. నా వొంట్లో శక్తి వున్నంతకాలం నీకేలోటూ రానివ్వను.

కామే : మీ రెప్పుడూ మాకు లోటు రానివ్వలేదు...నేనే ఆశ కెగిరి...(బయటకి చూసి) అడుగో మామ వచ్చేశాడు.

శంక : పో, జాగ్రతగా తలుపుతీసి, వెంటనే గడియ బిగించు.

కామే : (వెళుతుంది మహంకాళి ప్రవేశిస్తాడు. కామేశ్వరి వెంట వస్తుంది)

శంక : బండి వస్తున్నదా ?

మహ : ఆ వచ్చేసినట్టే! బేరంచెయ్యలేక నా తాడు తెగింది.

శంక : ఇంకా ఎంతదూరంలో వుంది ?

కామే : జాగ్రత్తగా రమ్మని చెప్పావా ?

మహ : (భయపడుతూ) చూడు శంకరం!

శంక : సామాన్లన్నీ సర్దినట్లేనా ? (మహంకాళితో) పో, అవి బయటపెట్టండి!

మహ : శంకరం, ఊళ్లో ఏదో అలికిడిగా వుందోయ్, మనం వెళతామని తెలిసిందా?

శంక : అలికిడా? ఎవరన్నా అడిగారా ?

కామే : ఏమనుకుంటున్నారు ?

మహా : (బయటికి చూస్తూ) రచ్చబండ దగ్గర ఏదో రెండు పార్టీలవాళ్ళూ గుసగుస లాడుకుంటున్నారు.

శంక : ఏమని ?

మహా : ఏమోమరి. కొందరి దగ్గర కర్రలుకూడా కన్పించి నయ్.

శంక : కామేశ్వరీ! నా పుస్తకాలు భద్రంగా పెట్టెలో పెట్టావా? ఈ పటాలూ ఇవీ వూడదియ్యి. నువ్వు కిటికీలోంచి జాగ్రత్తగా చూడు బండి వస్తుందేమో...నేను లోపలి కెళ్ళి మిగిలిన సామాను సర్దుతాను. (శంకరం వెళ్ళి పోతాడు)

మహా : అమ్మాయ్ ! విచారపడకమ్మా ! ఎప్పటికేం జరుగు తుందో ఎవరు చెప్పగలరు ? (బయటికి చూస్తాడు)

కామే : నాకేదో బిక్కు బిక్కు మంటున్నది. ప్రొద్దుటినుంచీ కుడి కన్నదురు తున్నది.

మహా : మీకేం ఫరవాలేదు. నేను మంత్రం జపిస్తున్నాగా! నే వచ్చి మళ్ళీ ఆ డబ్బుకూడా వసూలుచేసి పెడతా.

కామే : నాకు ఆ డబ్బువద్దు పాడువద్దు. ఆయన కేలపదా రాకుండావుంటే అదే పదివేలు. నువ్వు పెద్దవాడివి తగిన సలహా ఇస్తావనుకుంటే...

మహా : చేయతగిన వాళ్ళకు చేయతగినంత...

కామే : వొద్దు...వొద్దు...ఇక నీ సలహావద్దు.

మహా . ఏం ? కోపమొచ్చిందా అమ్మాయ్ !

కామే : కోపంకాదు. ఇక నీకూ మాకూ పడదు.

మహా : నే నెట్లాగూ వెళ్లిపోదలుచుకున్నానులే... నా దస్త్రం కొంచెం తెచ్చిపెట్టు. నా ఆయుష్షంతా అందులోనే వుంది.

కామే : సుందరమ్మ సరిగ్గానే చెప్పింది.

మహా : అప్పన్నే—జాగ్రత్తగా తీసుకురా.

కామే : ఇక అమ్మాయి ముఖం చూడలేముకదా! ఏ జన్మలో పాపం చేశామో ఈనాటికిట్లా అనుభవిస్తున్నాం.

మహా : దిగులుపడితే ఏంప్రయోజనం ... బండి వస్తుందేమో చూడనా ?

[బైటికి వెళతాడు. హఠాత్తుగా ఎదుట కిటికీ తలుపులు తెరుచుకుంటాయి. సుందరి ఆదుర్దాతో తొంగిచూస్తుంది]

సుం : అమ్మా! అమ్మా! నాన్నా...

కామే : (అక్కడికి ఆదుర్దాతో వెళుతూ) అమ్మా! సుందరీ!

సుం : అమ్మా నాన్నేడీ? ఇంట్లో వున్నాడా?

కామే : ఉన్నారమ్మా... మేమంతా...ఇప్పుడే...

సుం : ఇప్పుడే...

కామే : ఆఁ, అహాఁ! ఏంలేదు! ఏంలేదు! సత్యం ఇంట్లో వున్నాడా?

సుం : నాన్న లోపల లేడూ? చెప్పమ్మా.....వాళ్ళంతా మసెంటిమీది కొస్తున్నారు నాన్నకోసం. మునసబు ఇంటినుంచి గుంపులు గుంపులుగా బయలుదేరి వస్తు న్నారు. కర్రలు, బరిసెలు తీసుకుని-బ్రహ్మయ్యకూడా అక్కడే వున్నాడు.

శం : ఎవరా మాట్లాడేదీ ? (బైటికివచ్చి చూసి) నువ్వా ! ఎందుకీ తలుపులు తెరిచావ్ ? ఏం చేస్తున్నామో చూడాలనా ? అవతలికి పో...

కామే : ఏదో చెపుతున్నదండీ ! వస్తున్నాగటండీ ?

శం : వస్తున్నారూ ! నీకూ, సత్యానికీ కళ్లు చల్లబడ్డాయా ? మేం చస్తే రేపటినుంచీ నిశ్చింతగా బ్రతకండి !

సుం : నాన్నా ఇది బావకి తెలియదు. అసలు బావ ఊళ్లోనే లేడు నాన్న - బావున్నప్పుడే ఇట్లా జరగనిస్తాడా. వాళ్లొస్తున్నారు—నీ ప్రాణంమీదికొస్తుంది నాన్నా—నవ్వయినా చెప్పమాన్న ! తలుపులు బిగించి మా యింట్లోకి రండి !

కామే : వెళ్దాం పదండి. దాని ప్రాణం కొట్టుకుంటున్నది

మహా : (లోపలికి ఆదుర్దాగా వచ్చి) రచ్చబండదగ్గర బండిని ఆటకాయించారు—

శం : ఊహూం—అయితే ఇక్కడే నిలబడదాం. ఏంజరుగుతుందో చూద్దాం—

సుం : వద్దు నాన్నా—ఏదో అఘాయిత్యం చేస్తారు—తలుపులు బిగించి వచ్చేయండి దొడ్డితలుపు తెరుస్తున్నాను.

కామే : పదండి, దాని ప్రాణం అల్లాడిపోతున్నది.

మహా : పదబ్బాయ్ ! ఊపిరుంటే వుప్పమ్ముకుని బ్రతకొచ్చు !

శం : నోర్ముయ్ ! మీకు సిగ్గులేదు. (సుందరితో) నా ప్రాణం రక్షించేదానివా—మీరు చేసిన పనులకు మళ్ళా నీ ముఖం చూడమంటావా ? అసలు మీరే కొంపలో చేరింది నా పరువు తియ్యటానిక్కూ — అందులో

ఎవరిని దాచావు నా ప్రాణం తియ్యటానికి. (అంటూ కిటికీ తలుపులు మయ్యటానికి ప్రయత్నిస్తాడు.)

సుం : నాన్నా! నాన్నా విను నాన్నా!

శం : (గట్టిగా తలుపులు మూస్తాడు) హో! నువ్వు చచ్చినా పీడ వొదిలిపొయ్యేది—మహాంకాళీ! నువ్వు మొయ్య గలిగినన్ని సామానులు తీసుకో. నువ్వు బట్టలూ, నగలూ తీసుకో — బయలుదేరుదాం — పుస్తకాల పెట్టేదీ? (వెతుకుతుంటాడు. (బైట గోలచేస్తుంటారు)

కామే : బయట ఏమిటో గోలగావుంది... చూడు మామా! తలుపుతీసి చూడు.

[ మహాంకాళి వెళతాడు. ]

శం : తప్పదు! కామేశ్వరీ మనం వెళ్ళక తప్పదు! తెల్ల వారితే ఈవూరి ముఖం చూడలేను.

మహా : (భయపడుతూ వొణుకుతూవచ్చి) ఇంటిచుట్టూ గుంపు మూగుతున్నారు. ఆ యింట్లోకి పోదాం—పాపం అమ్మాయి......

కామే : (తలుపులు తెరుస్తుంది) సుందరీ!

సుం : (వచ్చి) రండి నాన్నా! మీకేం భయంలేదు. నేను వాకిట్లో నిలబడతాను—నా ప్రాణం పోతేనే మీ మీదికి...

కామే : వెళదాం పదండి!

సుం : మీకు భయంలేదమ్మా. ఇప్పుడే మాలపల్లెకు కబు రంపాను...నాన్నకోసం ప్రాణమిస్తారు. రా నాన్నా!

[ కామేశ్వరి, మహంకాళి గుసగుస లాడుతూంటారు. ]

శం : సుందరీ! లోపలికి పో! (గద్దిస్తాడు)

సుం : నా దగ్గరుండండి నాన్నా!

శం : వద్దు!

సుం : అయితే నేనే వస్తాను నాన్నా అటు తలుపుతియ్యండి.

[ సుందరి వెళ్లిపోతుంది. ]

కామే : దాన్ని రానివ్వండి నెలలొచ్చిన పిల్ల.

మహ : నేను వెళ్ళి తీస్తాను. (లోపలికి వెళతాడు. అలజడి ప్రారంభం క్రమంగా హెచ్చుతుంది.)

శం : వద్దు—తలుపు తీశారా మీ ప్రాణాలు దక్కవు— అదిగో అప్పుడే అలజడి ప్రారంభమయింది.(నవ్వుతూ) ఏం జరుగుతుందో జరగనివ్వండి. బయటి తలుపులు బిగించారా?

[సుందరి హఠాత్తుగా లోపలినుంచి వస్తుంది. నాన్నదగ్గరకు వెళ్లిపోతుంది. అతను గుడ్లురిమి చూస్తాడు భయపడి ఆగిపోతుంది. తల్లి దగ్గరకు వెళ్ళి ]

('అమ్మా' అని కౌగలించుకుంటుంది.)

శం : ఇది మనపాలిటి పిశాచం! దీన్ని మోసంచేసిందిచాలక మనల్నికూడా చేయించాలని చూస్తున్నాడు సత్యం!

సుం : నాన్నా! బావ వూళ్లోలేడు నిజం! నీతోడు నాన్నా, వూళ్లోలేడు.

[ మహంకాళి వస్తాడు. ]

మహ : ఎక్కడికెళ్లాడు వాళ్ళతో చేరి! గూడుపుఠాని చేస్తున్నాడేమో. గోల ఎక్కువౌతున్నదే!

సుం : ఈ ముసలాడు చేశాడిదంతా ! వీడు రాకపోతే మన కిన్ని కష్టాలొచ్చేవికావు.

[ శంకరం లోపలికి వెళతాడు. ]

కామే : అవును. వీడినిబట్టే మన ప్రాణంమీదికి కొచ్చింది.

[ క్రమంగా బయట అలజడి ఎక్కువౌతుంది. ]

మహా : చాల్లే అమ్మాయ్ ! అనుమానాలు !

శం : భయపడకండి—లోపలకి తీసుకుపో దాన్ని—

[ కామేశ్వరి సుందరిని లాగుతుంది. ]

సుం : నేనిక్కడే వుంటా !

[ బయట గోల ఎక్కువై కేకలు, కర్రల మోత వినిపిస్తాయి—ఎవరో తలుపు తోస్తున్నారు. ]

సుం : (మహాంకాళితో) అట్లా గుడ్లప్పచెప్పి చూడకపోతే కర్రందుకోరాదూ !

( శంకరంపోయి కర్రతో బయటికి వస్తాడు. )

శం : మీకే చెప్పేది— లోపలికి పొండి.

కామే : ఇది కదలందే.

సుం : నే నిక్కడే వుంటాను.

శం : ఎవరూ అక్కర్లేదు — వాళ్లు నా కోసమే వచ్చారు. అదేదో కానీ — ఇప్పుడింకేవరేం చేస్తారు ! మీకు భయంలేదు. నే నున్నాను.

(బయటనుంచి పెద్దగా కేకలు : "తలుపులు తియ్యండి. ఇల్లు నేలమట్టం చేస్తాం — మీ బ్రతుకేమౌతుందో చూసుకోండి. ఇల్లు తగలబెడతాం !" అంటూ కేకలు)

కామే : మాలోళ్లెవళ్లూ రాలేదే!
శం : ఎవరు తెలియజేస్తారు?
కామే : అమ్మాయి...
శం : పట్టేది... నా......
మహా : శంకరం నేను ముసలివాణ్ణి—
శం : నా ప్రాణాని కెవరూ అడుకోనద్దు! నాకీ బ్రతుకంటే చావే మేలు!

(బయట "తలుపులు, పగలగొడుతున్నాం—కిరసనాయిలుపోసి అంటిస్తున్నాం. ఇంట్లో ఎవరన్నా ఉన్నారా చచ్చారా?")

శం : ఉన్నాను!

( బయిటనుంచి "ఎవున్నాలుంటే రా!" )

శం : వస్తున్నా!

(బైటనుంచి "గాజులు తొడుక్కుని ఇంట్లో కూచున్నావా?")

( శంకరం కర్ర చేతపట్టుకుని ముందుకు వెళ్ళబోతుంటే కామేశ్వరి, సుందరి కాళ్ళకు అడ్డం తగులుతారు )

మహా : ఇక నేను వెళ్ళిపోతా! నా దస్తరం ఏదీ?
కామే : నువ్వా? ఇప్పుడెళతావా?
మహా : దొడ్డిదోవన...
శం : ప్రాణంమీద తీపి...
కామే : దస్తరం కావాలా?
మహా : ఇహ నే నుండి—

శేం : ఆహా! ఏం కుసుష్యాలు! (వెళ్ళిపోతాడు. కామేశ్వరి సుందరి పట్టుకుంటూంది.)

శం : వదలండి! నేను చావాలి

కామే : (ఏడుస్తూ) ఆగండి! ఆగండి!

సుం : నాన్నా! నాన్నా! నువ్వెళ్ళొద్దు నాన్నా! నిన్ను చంపుతారు నాన్నా!

(ఇంతలో బయట పెద్ద కొట్లాట చెలరేగుతుంది. లోపల అందరూ ఆదిగ్రహించి నిశ్చలంగా వక్క క్షణం ఆగిపోతారు బైటగలాటాలో)

మాలలు:—ఎవర్రా ఆయనొంటిమీద చెయ్యేసే మొనగాడు.

—మగసిరి వుంటే మీదికి రండి.

— వెయ్యండి, చూస్తారేం వెయ్యండి.

మహా : అదిగో మాలపల్లె వచ్చింది ఇక మనకు భయంలేదు.

కామే : అమ్మయ్య!

సుం : నాన్నా! నాన్నా! వాళ్లొచ్చారు నాన్నా! లోపలికి రా నాన్నా!

(బయట)

మాలలు :—చూస్తారేం పొడవండి.

—మీ రౌడీమూకని నరికేస్తాం.

శం : నువ్వు లోపలికి పో సుందరీ!

కామే : పో అమ్మా! నువ్వు వుద్రేక పడగూడదు.

సుం : ఫర్వాలేదులే అమ్మా. (తండ్రి చెయ్యి పట్టుకుంటుంది)

శం : నువ్వు పోతావా పోవా? వొట్టిమనిషివి కావు. నా మాట విను.

సుం : నువ్వుకూడా వస్తే లోపలికి పోతా.

శం : నే నిక్కడుండను. నేను బయటికి వెళ్ళాలి. వాళ్ళంతా నాకోసం బలికావడం న్యాయంకాదు. నువ్వెళ్ళమ్మా—

సుం : రా నాన్నా ! రా నాన్నా !

శం : పో ! ముందు లోపలికి పో—నీకోసం కాకపోయినా నీ బిడ్డకోసం చెపుతున్నా—పో ! దాన్ని లాక్కుపో.

( కామేశ్వరి సుందరిని లోపలకు తోసి బయటకొస్తుంది. ఇంతసేపూ మహంకాళి కిటికీలోనుంచి బయటకు చూస్తూ వుండి, హఠాత్తుగా తలుపు దగ్గరకు పోతాడు ... ... )

శం : వస్తున్నా! కామేశ్వరీ జాగ్రత ! (వెళ్ళబోతుంటే పెద్దగా సుందరి ఏడుపు వినిపిస్తుంది.)

సుం : అమ్మా ! రావే ! అమ్మా రా అమ్మా! అబ్బా బాధ అమ్మా !

(కామేశ్వరి లోపలికి పరుగెత్తుతుంది. శంకరం నిశ్చేష్టుడై నిలబడతాడు)

శం : కామేశ్వరీ ! పో సుందరి ప్రసవిస్తోందా—బాధపడుతోంది చూడు !

(బయటనుంచి తలుపులు తోస్తున్నారు. మహంకాళి ఆపుతున్నాడు)

మహా : నే నొక్కణ్ణే ఆపలేను.

శం : వస్తున్నా పద (మహంకాళి వెళతాడు. శంకరం వెళ్ళబోతుంటాడు.)

కామే : (వచ్చి సుఖదుఃఖాలతో) రండి !

శం : సుందరి బాగున్నదా ?

కామే : ఒకసారి రండి ! ఆ పసికందును చూడండి ! (లోపలికి వెళ్ళబోతాడు.)

మహా: శంకరం! రారా వాస్తున్నారు! వొద్దు రావద్దు.

శం : (కామేశ్వరితో) నేను రాను. వాళ్ళంతా నా కోసం చానకూడదు. వస్తా, బ్రతికుంటే వస్తా.

[ కర్ర తీసుకుని బయటికి వెళతాడు బయట గోల తగ్గిపోతుంది. వెంకటేశ్వర్లు, యేసోబు లోపలికి తూలుతూ వస్తారు. వాళ్ళ తల గాయలకు గాయాలు తగిలి రక్తం కారుతున్నది. బట్టలు చిరిగి పోయినయి. శంకరం వస్తాడు. వాళ్ళిద్దరూ తూలుతున్నారు...]

శం : (ఆదుర్దాగా) మహంకాళి రానాలి! ముందు రా! కామేశ్వరీ నీళ్ళు తీసుకురా!

మహా: తలుపు తోస్తున్నారు. నన్ను చంపేస్తారు.

[ మళ్ళీ గోల ఎక్కువౌతుంది. ]

శం : వాళ్ళిద్దరికి పరిచర్య చెయ్యండి.

వెంక బాబూ! వద్దు బాబూ! వెళ్ళొద్దు! సత్యంవున్నాడు

యేసో: అతను చూస్తాడు, మీకేంపర్వాలేదు.

శంక : సత్యం వున్నాడా! సత్యం! పోట్లాడుతున్నాడా? మనతరఫున.

వెంక : కర్ర అడ్డుపెట్టి నన్ను రక్షించాడు బాబు.

శంక : నా కంత అర్హత వుందా? ఇంతమంది ప్రాణాలు త్యాగంచేసే అర్హత నాకులేదు. నేను సంపాదించు కుంటాను—వస్తున్నా (వెళ్ళిపోతాడు)

వెంక : (తెప్పరిల్లి) ఏరి? పంతులుగారేరి?

యేసో: ఓ పంతులుగారూ____

వెంక : బయటికెళ్లి సూడుమామా! (లేవబోతూ) పంతులు గారో (యేసోబుతో) ఆయన తలుపుదగ్గర లేరు, బయటకెళ్ళారు! ఏదో వుంది! నేను చూస్తాను. (ముందుకు వెళ్ళబోతుంటే లోపలినుంచి మంట కన్పిస్తుంది)

వెంక : ఏమిటండీ!

మహా : ఎక్కడిదామంట!

యేసో : ఏమిటి?

కామే : (నవ్వుతుంది) నీ దస్త్రం తగలబెట్టాను.

మహా : ఆ, నిజంగా తగలబెట్టావా (లోపలికి పరుగెత్తుతాడు)

కామే : ఆయనేరి వెంకటేసూ!

వెంక : నే వెడతా—ఆయన ప్రాణం తియ్యాలనే వచ్చాడు.

(సత్యం పరుగెత్తుకుని వచ్చాడు లోపలికి)

సత్య : మామఏడి? సుందరి ఏదీ? దెబ్బలు తగిలినయ్యా?

కామే : సుందరి ప్రసవించింది.

సత్య : మామ ఏడీ? ఎక్కడున్నాడు?

కామే : బయటకెళ్ళాడు.

(వెంకడు, యేసోబు ఈడ్చుకుంటూ వెడుతూంటే)

సత్య : వొద్దు! వొద్దు! మీరొద్దు! నేను వెడతాను. ఆయన వెళ్ళాడా ఒక్కడే.

[బయటకెళ్లి వెంటనే శంకరాన్ని పట్టుకుని లోపలికి వస్తాడు. కామేశ్వరి పట్టుకుంటుంది. వెంక, యేసోబు దగ్గరకు వస్తారు]

శంక : మీాకు నేను కృతజ్ఞుణ్ణి! మా కుటుంబమంతా జీవిత పర్యంతం మీాకు సేవచెయ్యాలి...

వెంక : కూచోబెట్టండి.

సత్య : ఎలావుంది ? నెత్తుకు తుడువు...మంచినీళ్ళు కావాలా

యేసో : కూచోండి.

శంక : సత్యం ! నన్ను క్షమించు !

సత్య : ఊరుకో మామా ! ఇప్పుడు మాట్లాడొద్దు !

వెంక : కొంచెంసేపు పడుకుంటారా ?

కామే : (లోపలి కెడుతుంది)

శంక : మీా జీవితమంతా ఇతరులకోసం బలై పోటమేనా - మీా దారిన మీారు బ్రతకండి (పడిపోతాడు)

వెంక : మీారు మాటాడొద్దు బాబూ ఈ గండం గడిచింది అదే పదివేలు.

(కామేశ్వరి వస్తుంది)

శంక : సత్యానికి బిడ్డని చూపించావా ? నాకు మనుమడు కలిగాడు ! నా చిట్టితల్లికి బిడ్డ పుట్టింది ! పో ! తీసుకురా !

(కామేశ్వరి వెడుతుంది)

సత్య : చూస్తాలే. నువ్వు మాట్లాడకు.

శంక : అబ్బ ! గుండెల్లో పొడిచాను ! ఇహ మారుతుంది. నేనూ నా పూర్వులూ, మన పూర్వులంతా కుళ్ళులో పడి కొట్టుకున్నారు ! నా వంశం ఈ లోకమంతా

ఇహ మారుతుంది! నీ బిడ్డ, నా రక్తం, ఇక కొత్త లోకాన్ని సృష్టిస్తుంది! మనదంతా పీడకల! బ్రతుకే ఒక పీడకల! (లేచి వెళ్ళబోతుంటే కామేశ్వరి బిడ్డను తెచ్చి చూపుతుంది. చేతుల్లోకి తీసుకోబోతాడు) ఎందుకు నా పాపపు చేతులతో దాన్ని మలినం చెయ్యను...సుందరి నిద్రపోతోందా ... సుందరీ! (లోపలికి వెళ్ళబోతూ) సత్యమొచ్చాడు! మనసత్యం! ఒకసారి నవ్వు, లోకాన్ని నీ నవ్వు చూడనీ!

(పడిపోతాడు.)

[ తెర జారుతుంది. ]

---



అభ్యుదయ కవిగా, ప్రముఖ నాటక కర్తగా, సినిమా రచయితగా ఆంధ్ర సాహితీలోకానికి సుపరిచితమైన వ్యక్తుల్లో అనిసెట్టి సుబ్బారావుగా రొకరు. జననం 1922. పట్టభద్రులు. కొంతకాలం లా, మరి కొన్నాళ్ళు ఎం. ఏ. చదివారుగాని రాజకీయ కారణాలవల్ల పూర్తిచేయలేకపోయారు. చిన్నప్పటినుండీ నాయని, కోలవెన్ను, అడవి బాపిరాజు గారల సాహచర్యంతో ఆయన సాహిత్య అభిరుచికి పుష్టి, ప్రజాశక్తి, అభ్యుదయ, ప్రతిభ పత్రికల్లో సంపాదక బాధ్యత వహించడంద్వారా, బహుముఖ వ్యాప్తి చెందింది. కవిత్వం, నాటకం, కథ, వ్యాసం మొదలైన సాహితీ రంగంలోని అన్ని శాఖలలోనూ ప్రతిభ వుంది.